# SANGEETHA
# Jayantha Jayapalam.

AN ORIGINAL DRAMA
IN FIVE ACTS

PUBLISHED BY

*Karra Atchayya,*

BOOK-SELLER,

RAJAHMUNDRY.

SIXTH EDITION 2,000 COPIES.

PRINTED AT:

SCAPE & Co., by K. SUBBARAYUDU Bros.,

COCANADA.

1923.

Price 8 As. Postage extra.

| | | |
|---|---|---|
| ఘూలిసుబ్బారావు పాటలు పార్టు 1 | 0 | 12 |
| డిటో 11 | 0 | 12 |
| శాంతగోవిందనామాలు | 0 | 2 |
| లంకాయాగం | 0 | 2 |
| నోముల కథలు | 0 | 8 |
| కుశలవులయుద్ధము | 0 | 8 |
| పెద్దకుచ్చులకథ | 0 | 8 |
| చిన్నకుచ్చులకథ | 0 | 4 |
| శ్రీజనానంద కళ్యాణపాటలు | 0 | 1 |
| గృహకల్లోల నివారిణి | 0 | 8 |

## వైద్యగ్రంథములు.

| | | |
|---|---|---|
| వైద్యచింతామణి 2 భాగములు. | 10 | 0 |
| బసవరాజీయము | 7 | 0 |
| బాహటసూత్రస్థానము | 6 | 0 |
| అనుభవవైద్యము (8 భాగములు.) | 4 | 0 |
| శార్ఙ్గధరసహిత | 3 | 0 |
| చికిత్సాసారము. | 2 | 8 |
| సర్వౌషధగుణకల్పము. | 2 | 8 |
| ధన్వంతరినిఘంటు | 2 | 8 |
| శుశ్రుతశారీరము. | 2 | 8 |
| వశిష్టప్రోక్తము. | 1 | 8 |
| ధన్వంతరివిజయము | 0 | 8 |
| నేత్రదర్పణము. | 0 | 8 |
| వ్రణచికిత్స | 0 | 8 |

| | | |
|---|---|---|
| సద్వయిద్యజీవనము. | 0 | 8 |
| వాజీకరకల్పతరువు | 0 | 8 |
| నాడీనక్షత్రమాల. | 0 | 4 |
| రసప్రదీపిక | 0 | 2 |
| వైద్యరత్నము | 1 | 8 |
| వైద్యపదనిఘంటు గుణభూషణం | 0 | 8 |
| వైద్యామృతము | 1 | 4 |
| సిద్ధమూలికారహస్యము యంత్రమంత్రసహాయము | 1 | 4 |
| రసయోగరత్నాకరము | 0 | 12 |
| అశ్వవైద్యశాస్త్రము | 1 | 0 |
| చికిత్సారత్నము | 1 | 4 |
| సుఖరోగచికిత్సరత్నము | 0 | 12 |
| అనుపానమంజరి | 0 | 8 |
| బ్రహ్మజ్ఞానానందము. ఇందుప్రపంచసృష్టిక్రమం అఖండజ్ఞానము ప్రపంచలయము తత్వజ్ఞానవృత్తి భగవంతునిప్రభావము జనులగుణములు స్త్రీలుచేయుచర్యలు ముక్తిమార్గము గృహస్థధర్మమార్గము యింకను అనేకవిషయములుగలవు. చదివితీరవలయును. | 2-0 | |

సంగీత

# జయంతజయపాలము.

(ఐదంకముల నాటకము.)

ఆఱవ కూర్పు 2000 ప్రతులు.

కాకినాడ:

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాల న్ముద్రితము.

1923.

## ఈనాటకమున వచ్చు పాత్రలు.

### పురుషులు.

జయంతుఁడు—కల్యాణపురాధీశ్వరుని కుమారుఁడు

జయపాలుఁడు—జయంతుని మిత్రుఁడు

చిత్రకేతుఁడు—పాంచాలపురాధీశ్వరుఁడు

వీరసేనుఁడు—చిత్రకేతుని కుమారుఁడు

జయవర్మ—చిత్రకేతునిమంత్రి

శంకఁడు—ప్రభావతియొక్క విటకాఁడు

### స్త్రీలు.

చారుమతి—జయపాలుని భార్య

నర్మద—చారుమతి చెలికత్తె

ప్రభావతి—జయంతునిభార్య

మోహిని—కల్యాణపురమునను్న వేశ్య





# సంగీత జయంత జయపాలము.

## నాంది.

చ. సుమతులఁ బుణ్యమూర్తులను సూనృతవాదుల దేశభక్తులన్
విమలుల సత్కృపాకరుల వేడ్కలరారగ నెప్డు బ్రోచుచున్
గుమతుల శిక్షసేయుచు నకుంఠితలీల జగంబునేలు శ్రీ
రమణుఁడు సర్వసద్గుణవిరాజితుఁ డేలునుగాక సభ్యులన్.

సూత్ర—(నాంద్యంతమున) అతివిస్తరంబేల? నటీ! నీ యలంకారము పూర్తియైనచో నొకసారి యిటురమ్ము.

నటి—(ప్రవేశించి) నాథా! వచ్చితిని. నగలు శృంగారించుకొనుటలో నొక్కింతయాలస్యమైనది. క్షమింపుఁడు.

సూత్ర—నీకును నీ పిచ్చిపట్టినచా. ఆహా! కాంతలెంత యస్వర్ణాభిలాషఁ బడుచుండిరి.

నటి—నాథా! నాయజ్ఞానంబున కాగ్రహింపకుఁడు.

సూత్ర—రమణీమణీ! నిన్నననేల. ఈ కలికాలంబునఁ గాంత లెట్లుండిరో తెలియును గదా.

సీ. బొట్టు మోపించును బొట్టుపెట్టుటమాను
  భామామణుల్ కడు బ్రబలినారు
పతిసేవ విడనాడి పరపూరుషుని జేరు
  పూబోఁడు లెందరో పుట్టినారు
మానాభిమానంబు బూనకింతేని సం
  సారులే దొమ్మర సానులైరి
పరపూరుషుని జేరఁ బ్రాణేశ్వరుని జంపు
  బింబోష్ఠు లెందఱో వెలసినారు

తే. గీ. [illegible]లిగి విచిత్రగతుఁ । జెలఁగుచు[illegible]
[illegible]ద్యానంబు నిప్పుడో । [illegible] కాల
మాఁగి విహరించి మదికి సౌ । ఖ్యంబుఁగూర్చు
కొందమో ప్రాణహితుఁడ యా । నందమెసఁగ.

జయపా—మిత్రమా !

తే. గీ. కుసుమఫలవితానంబులు । కొమరుమిగిలె
నందనోద్యానమనఁగ నా । నందమొదవె
నిందువిహరించి కడుసుఖ । యించి పిదప
గృహము జేరంగఁబోదము । కీర్తిసాంద్ర.

జయం—మిత్రమా ! నీయిచ్ఛవచ్చినట్లు చరింతము. అదిగో! ఆ కాసారంబున కేఁగి యచ్చట నొకింతవిశ్రమించివృక్షంబులనుండివచ్చు మందమారుత సౌఖ్యంబును గాంచుదము. (కాసారము జేరుచున్నారు.)

జయపా—మిత్రమా! స్నేహమునకు మించినపశ్రస్తమైనవస్తు వీజగంబున లేదుకదా! అందుమనమిత్రత్వమునుగురించి నుడువఁదరంబు గాదు. మన మైత్రికి భంగముగలిగింప మనజనకు లెంతయో ప్రయత్న ము చేసిరికదా. దానఁ బ్రయోజనం బేమియు లేదు.

జయం—సఖా! ఇట్టిది యొకరివలన నగుకార్యము కాదు. మన మైత్రిని బురహరుఁడువచ్చి బాపవలెనని ప్రయత్నించినను బాయునా రము కాము. ఇది యాచంద్రతారకంబుగ వెలుఁగునదే. నీమనంబున నెట్లున్నదో మాత్రము నాకుఁ దెలియదు.

జయపా— తే. గీ. కులముపోనిమ్ము కడగండ్ల । గుడువనిమ్ము
అగ్ని చల్లబడగనిమ్ము । నబ్ధి నింక
నిమ్ము జనకుండు దూషింప । నిమ్ము నీదు
మైత్రి వీడంగఁ దలఁపను । మాన్యచరిత.

జయం—అదియే నాకుఁ గావలసినది.

(తెరలోఁ బాట వినిపించుచున్నది.)

జయం—ఆ మృదుతర కంఠస్వరం బెవ్వరిదో చూచితివా ? ఏమి గానము !

సీ. వాణీమహాసతి  వాయించువీణార
వం బిదియంచుభా  వమునఁదోఁప
సంగీతరసమిట్లు  గంగాప్రవాహమై
పాఱుచుండెనటంచు  మదికిఁదోఁప
హరిభక్తి యీరీతి  నవతారమెత్తెనా
యనగ వినెడివారి  కాత్మఁదోఁప
కోకిలారవమిద్ది  ప్రాకటంబుగనంచు
చిత్తంబునందున  చ్చెరువుబుట్ట

తే. గీ. సరసమై తనరెడి తన  స్వరమునెత్తి
పాటఁబాడుచు నిప్పుడీ  బాటవచ్చు
చుండెఁ గాంచినావె! మిగుల  చోద్యముగను
నందముల కిక్కయై యొప్పు  మందయాన.

(పరికించి) ఆహా! పాటబాడుటయే కాదు.

చ. అడుగులు మెల్లగానిడుచు  నట్టిటుజూచుచు నోరచూపు సొం
పడర; పరీక్షసేయుచును  భవ్యవనంబును; పాటఁబాడుచుఁ
వడివడిఁ బూలఁగోయుచు ను  పర్వసతీమణి సుందరత్వముఁ
లలి బుఱడింపఁగాదగిన  నాతిని జూచితివే హితోత్తమా.

తే. గీ. తరుణిశారీర సౌందర్య  తతులు వనము
నెల్లెడలనాక్రమించి యి  ప్పెంతశోభ
గలుగఁజేయుచునుండెనో  కాంచినావె
దివ్యలావణ్యసీమ న  తీలలామ!

(మోహిని ప్రవేశించుచున్నది.)

మోహి — (స్వగతము)

(2) పాట — మోహిని. — జంఝూటి రాగము - త్రిశ్రజాతి

1 నాసరిమాయదారి। నాసాటితంత్రకారి। కాంచినాశోభవిభ్రమ కామినులయందుమీరు!
లేనిపోనిప్రేమచూపి। మానవులబంధివైచి। మానధనమెల్లగొని। పసిబూసిపంపుదాన॥ నాసరిమాయదారి॥

2 తంత్రములబన్ని మైత్రి। తలగజేసిచింతనుంచు। సూత్రమును బట్టినాను। చూడుడయ్యనామహిమ॥ నాసరిమాయ॥

సీ. మాయమంత్రము బన్ని ॥ మహితగుణాఢ్యులఁ
జెచ్చెర వశులుగాఁ ॥ జేయుదాన
పటువేషమునుబూని ॥ విటకాండ్ర వంచించి
ధనమునెంతైనఁ గై ॥ కొనెడిదాన
లేనట్టిపోరు గ ॥ ల్పించి జనుల్ మెచ్చఁ
బతిసతులను నెడ ॥ బాపుదాన
కల్లప్రేమలజూపి ॥ కాంక్షదీరంగను
జేసెద జారుల ॥ సేవకులుగ

తే. గీ. విదియునదియంచు లేదిక ॥ నెన్నియైన
చేయఁగాఁగల సతతంబు ॥ చెలువుమీర
తోడివేశ్యలు నన్ను సం ॥ తోషభావ
మూని సేవించుచుండంగ ॥ నుర్వియందు.

మహారాజుగారు నన్నుబిలపించి జయంతజయపాలురమైత్రికి నెట్లయిన భంగముగలిగింపుమని యానతిచ్చిరికదా. ఇప్పుడా కార్యంబునందు నే నేమరక ప్రవర్తింపవలెను. (జయంతజయపాలురఁ జూచి) ఇరుగో వారిక్కడనే తటస్థించినారు.

జయం—(మోహినినిజూచి) మిత్రమా! తరుణీమణి నిప్పుడు కలవుదీరఁ జూడవచ్చుచు చూడుము

చ. కమలభవుండు వేడ్కఁజిర | కాలము ఘోరతపంబు జేసి, యా
కమలముఖిన్ సృజించెనటు | గానియెడన్ మదినెంచిచూడఁగా
విమలమృదుత్వమున్ సొగసు | వేడ్కలునిండిచెచూపుగోపులున్
సుమహితదేహసౌష్ఠవము | శోభిలుచుట్టులు ప్రాణమిత్రమా.

భళిరా! ఈయిందుముఖి సుందరవదనారవింద సందర్శనంబుఁ జేసి నాజన్మము పావనంబైనది. ఇట్టి తరుణీశిరోమణిం గూడని నాజన్మమేల? సఖా! ఈమెయెవ్వరో యరయుదమా?

జయపా—అరయనవసరములేదు. ఇది మన పురంబుననుండు వేశ్యయే.

జయ—అట్లయినచో నేఁటిరేయి దీనిగృహంబునకు మనము బోవచ్చును.

జయపా—

చ. హరహర యెంతమాట హితుఁడాయిటులాడగ నెట్లుతోఁచెనో
పరవనితన్ రమించుటలు | భావ్యమె శ్రేయముసంపదాయమే
స్థిరతర కీర్తిపోవుగద | చెల్వఁగనవ్వరె చూచువారలున్
సరతిము మానసంబునను | నీరజనేత్రియుఁ గుందుచుండదే.

జయం—నీవనిన ట్లీమె పరవనిత కాదుకదా. వేశ్యయేకదా. కావున నేఁటిరేయి నాకోరికం దీర్చికొందు.

జయపా—మిత్రమా!

తే. గీ. ఎవఁడు ధనమీయ నాతఁడే | ధవుడటంచు
వలపుఁ జూపించుచుండి ద్ర | వ్యంబు గొందు
రెపుడు నిజమైనప్రేమలే | దింతయైన
మాయలకు లంజలకొలంబు | మాతృగృహము.

తే. గీ. ధనమునిచ్చిననెపుడు ము దంబుగూర్చు
ధనమునీయంగలేకున్న దరలఁజేయు
కంచుకాగడఁ వెదకిన కరుణలేదు
వివిధ కుగుణగణోపేత వేశ్యమాత.

వేశ్యాంగనలపొందు హేయభాజనంబని నీకుమాత్రము తెలియదా ? తెలిసియుండియు నిట్టుల యజ్ఞానాబ్ధిలోఁ బడెదవు.

జయ—సఖా ! అనేకమందయాండ్రఁ దిలకించితినిగాని యీ యందచందంబులుగల కుందరదన నెందును వీక్షించియుండ లేదు. ఈకాంతామణింజూచినయంతనే మారుండు నాపై శరంబులఁ బఱుప సాగెను.

జయపా—పెద్దలచే హేయంబుగఁ జూడఁబడుచున్న యీ వేశ్య పొందు నభిలషించుచున్న నిన్నేమని వారింపఁగలను. చాలుఁజాలు. ఇంక నీవాసంగతి గట్టిపెట్టుము.

మోహిని—(స్వగతము) అదుగో! రాజకుమారుండును నతని సఖుండును నేదియో సంభాషించుచున్నారు. ఇప్పుడు నేనొక చిత్రమును జేసి యాపిదప నేమగునో యీప్రాంతంబునందుండి వీక్షించెదను. (మంత్రికుమారుం జూచి చేసైగఁజేయుచున్నది.)

జయం—మిత్రమా ! నిన్నేటికో యవ్వారాంగన పిలుచుచున్నది. ఒక్కసారి బోయిరమ్ము.

జయపా—(వేశ్యను సమీపించుచున్నాఁడు.)

మోహి—(మంత్రికుమారుంజూచి) మంత్రికుమారా ! వచ్చితివా? ఇటురమ్ము. నీకొకరహస్యంబు జెప్పెదను. (అని చెవిలోనేదియో చెప్పి నిష్క్రమించుచున్నది.)

జయపా—ఛీ! కులటా! ఆఁడుదానవు కాఁబట్టి బ్రతికిపోతివి (అని జయంతుని సమీపించుచున్నాఁడు.)

జయం—(జయపాలు నవలోకించి) సఖా! నిన్నా వారాంగన యెందులకుం బిల్చె?

జ. పా—ఏమియు లేదు. ఏదో రహస్యము చెప్పెదనని చెవిలో "వడ్లగింజలో బియ్యపుగింజ" యని పలికి తనదారిని బోయెను.

జయం—ఏమి! అట్లని చెప్పిపోయెనుగా! వంచన జేయుపలుకు లెప్పుడు నేర్చుకొంటివి?

(3) సాంగు—జయంతజయపాలుర డైలాగుమోహన-రూపకము

1 జయపా॥ దైవసాక్షి నామాటయథార్థము సుమి నమ్మిమీ॥ దైవసా॥
ఈవేశ్యలమాయమాట। లిట్లే మోసగించుమీ॥ దైవసా॥

2 జయంతు॥ చాలుచాలుచలుపుడవని। చాలమోసపోయితి॥ చాలు॥
పిలచివడ్లగింజలోని బియ్యమంచు జెప్పునా॥ చాలుచాలు॥

3 జయపా॥ అనృతమాడు వాడగాను। అనలసాక్షిగా నేను। మనసు
కలతపరచిమనల। మైత్రి చెరుప। జెప్పునా॥ దైవసాక్షి॥

7 జయం॥ నాకుదెలుపనిచ్చలేక। సాకుపన్ని నావుగా। రాకునా
దుచెల్మికినిచి। రాకుగలైనాకిక॥ చాలుచాలు॥

జయపా—నీపాదసాక్షిగ నిక్కంబుబల్కితిని. ఇందసత్యమెంత మాత్రమును లేదు. అనుంగుసఖా! నాసంగతి నీవెఱింగియు నిట్లేల పల్కెదవు?

జయ—ఓరీ! జడమతీ! నీసంగతి నెఱుంగక మోసపోతిని. ఆహా! ఎంత టక్కుటమారవిద్యలు నేర్చితివి! నేనభిలషించిన యారమణింగూడ దలంచి యా కాంతతో నెద్దియో సంభాషించి నాయెద్దనసృతంబులు బల్కుచుంటివా?

తే. గీ. బాల్యమిత్రుండవంచు నా కె భావమందు
దలఁచితిసిగాని యీరీతి కె దలఁపలేదు

భళిర గనుగొంటినేఁడు నీ । మైత్రిమహిమ
చాలుఁజాలింక నిదె నమ । స్కారమయ్య.

జయపా—(తనలో) అక్కటా! ఆటక్కులాడి యెంతగార్యంబు చేసెనుకో ఎన్నఁడును నాయందు నింద వేయని ప్రాణసఖుండు నేఁడిట్లు పలుకసాగెను. ఇప్పు డేమి చెప్పుదును? (ప్రకాశముగా)

ఉ. తల్లినిగోరినట్లుసుమి । తథ్యముబల్కుచు నుంటెనిప్పు డు
త్ఫుల్లసరోజనేత్రి రతి । బొందఁదలంచిన వాఁడనేని నా
యుల్ల మసత్యముఁ బలుక । నొప్పదు నీకడ, నివెఱుఁగవే
సల్లలిత ప్రతాపగుణ । సాగర నీవిటులాడఁబాడియే?

జయం—ఈమాటలకేమి లెమ్ము. ఎంతటివారైనను నిట్టి సమయంబులం దన్నృతంబులాడ తీరుదురు. ఆహా! చిన్నతనంబునుండియు నిన్ను నమ్మి మోసపోతిని.

తే. గీ. పాముకుఁ బాలువోయుచు । భవ్యమతిని
బెంచి పెద్దదానిగఁ జేయ । నంచితముగఁ
గరుణబూనక కఱచెడి । కరణిగాఁగ
నొప్పుచున్నది నీనేస్త । ముర్వియందు.

జయపా—(తనలో) ఆహా! ఇప్పుడేమందు. అయ్యో! ప్రాణపదంబగు సఖుండు నన్ను నిష్కారణంబుగ నిందించుచున్నాఁడు. కట్టా ఏమిసేయుదును? (ప్రకాశముగా)

తే. గీ. లేదు నాయందు దోషంబు । లేదులేదు
ఎపుడు మోసంబుచేయఁగ । నెంచలేదు
అన్నృతమాడంగఁ దలఁపలే । దాత్మయందుఁ
గరుణఁ జేపట్టి రక్షింపు । వరసఖుండ.

మిత్రమా! బాల్యంబాదిగ నెన్నఁడును నీతో నసత్యమాడక నా ప్రాణములకన్న నిన్నెక్కుడుగఁ బ్రేమించుచు సంసారమునైననుసరకు

గాన నీతోడిదె లోకంబని చరించుచున్న నన్నీరీతింబలుకన్యాయమా?

జయం—చాలుఁజాలు. ఇంకననవసర ప్రసంగము చేయఁబోకుము.

ఉ. చాలునుజాలు స్నేహితపు | సంగతులన్ గనుగొంటి చక్కఁగా
బేలతనంబుఁబూని యవి | వేకువనై చరియించినాఁడ నీ
లీలను మైత్రి; చిత్రమగు | లీలల వంచఁ చేతువంచునో
బాలిశ! యెంచలేదెపుడు | భావమునందున వేయునేటికిన్.

ఇంక మారువలుకక గృహంబునకుఁబొమ్ము. నామిత్రత్వమును నేటినుండి మఱచిపొమ్ము.

జయపా—సఖా! ఎంతకర్ణకఠోరములగు పల్కులఁబల్కుచుంటివి?

మ. అకటా! నన్నిటులాడ బాడియగునా | హా! మిత్ర! యేమందు? న
య్యకలంకాత్ముని పదసాక్షిగను నా | యందెప్డు ద్రోహంబు లే
దొకయింతేనియుఁ జెల్లునే యిటులకో | పోద్యోగముంబూనఁగా
నిఁక నేఁడేడకుఁబోదు దిక్కెవరు నీ | వే కాక భూమండలిన్.

జయం—

మ. ప్రతిమాలన్ బని లేదు లేదు వినుమా | పల్మాటలిం కేల, ని
శ్చితముల్ దెల్పితినీదు స్నేహమిఁకఁ గాం | క్షింపంగఁ జిత్తంబు, స
మ్మతినిం బూనది కేమిచేసెదను బో | మ్మా వేగ నన్వీడి, సు
స్థితసౌఖ్యంబును జెందు వారవనితన్ | జెల్వొందగా గూడుచున్.

జయపా—హరహరా! ఎట్టిమాటలాడుచుంటివి. నిన్నుబాసి నే నెందుబోగలను. మిత్రమా! నామనంబు బరిశోధించుట కిట్టులాడుచుంటివా లేక నాకర్మఫలం బిట్టులుండెనా. నిన్ను విడనాడి త్రుటికాలంబైనను జీవంబులతో మనగలనా? నీవిషయమై నేనెప్పుడును ద్రోహంబు దలపలేను. అట్టిదేదైన నుండెనేని గరుణింపుము.

జయం—(స్వగతము) ఈదుర్మార్గుడు నన్నిదివఱకెంత మోసము చేసినాడో. ఈతని స్నేహంబున మఱగి నేను సంసారసుఖంబులుగూడ

మఱచియుంటిని. ఇంక నేను నేటిదినంబున మాతండ్రిగారి సెలవుగైకొని మాయత్తవారింటికేఁగి జాయాందిలకించెద.

జయపా—స్నేహితుడా! నాప్రార్థనమంగీకరింపవా.

జయం—ఇంక నీవాసంగతి దలపెట్టకుము (అని నిష్క్రమించుచున్నాఁడు)

(4) సాంగు—జయపాలుడు ఫీల్వారాగము-ఆదితాళము

1 ఎంతచేసెనీవేశ్యతా । మంతనమున మామైత్రిచెరచెనయ్యో॥ ఎం॥ పిలచివడ్లగింజలోననున్నది । బియ్యపుగింజనిపలికె । నాచెలువుడిట్టిమాటనమ్మకెంతయు । నలిగినన్నుబోనడచె । యీమాయలఘుచింతనెట్లుదాటిబ్రతుకుదు । నవనిలోనహాశౌరీ । గిరిధారీ । యేదారి । దనుజారీ॥ ఎంతచేసెనీవేశ్య॥

2 ధరణిలోనవేశ్యకాంతలెంతటి । తంత్రమైనబన్నుదురు । శరధివారిచేట చెరగనేర్తురు విరతురావమోకాల । యీసరసిజాండముబంతులట్లకొని । చక్కగనాడెడువారు । మననీరు । ధననారులిలవారీ॥ యెంతచేసెవేశ్య॥ యెంతచేసె॥

జయపా—అక్కటక్కటా! ఆమాయలాడి యెంతచేసినది. దానిమూలంబునఁగదా మాస్నేహము భంగమైనది. అయ్యయ్యో! త్రుటికాలంబైనను నన్ను బాసి యెరుంగనిమిత్రుండు నన్నుఁబాసె. హా! దైవమా! నాకిట్టిచింతగూర్ప నీకు న్యాయమా. (యించుక యూరకుండి) స్నేహంబునకు మించిన వస్తువు మరియొంకు లేదుకదా. ప్రాణమిత్రుఁడగుజయంతుఁడే నామైత్రివలదని నిరాకరించినప్పుడు నేనీపురంబుననుండనేల? సన్యాసివేషంబు ధరియించి నాయిచ్చవచ్చినస్థలంబులందుఁ జరించుచుఁ గాలంబు గడపెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

[వెంటనే మోహిని ప్రవేశించుచున్నది.]

మోహిని—(స్వగతము) నాతంత్రము బాగుగా ఫలించినది. వీరిరువురి మైత్రికిని భంగముగలిగినది. అవును. భంగము కలుగ కేమగును. నేను చేపట్టిన కార్యము మరియొకతీరున జరుగునా. ఇంక నేనీసంగతి రాజుగారికిం దెలిపి బహుమతిం గొనియెద.

(నిష్క్రమించుచున్నది.)

ఇది ప్రథమాంకము.





# సంగీత జయంత జయపాలము.

## ద్వితీయాంకము.

### పాంచాలపురము.

[ప్రభావతి సౌధము.]

(5) సాంగు—జయపాలుడు కళ్యాణిరాగము-రూపకము

1 పాలనీళ్ళబోలు చెల్మి । పాడువడెనుగా॥ దైవవిధిని॥ పాల॥ ఏలబ్రి
తుకు సఖుని బాసి । యొందుజొచ్చెదా॥ కష్టమగుచు॥ పాల॥

2 మాయదారి పాడువేశ్య । మాటసెల్లెగా॥ మాయెడలను॥ మా॥
మాయపనిపతిపుత్రుడు । దాయయయ్యెగా॥ ఏమిసేతు॥ పాల॥

జయపా—(సన్యాసి వేషముతోఁ బ్రవేశించి) ఆహా! కాలస్వంతయు నొక్కతీరునఁగడప నెవ్వరికినిఁ దరంబు కాదుగదా. త్రుటిలో నేమి సంభవించునో యెవ్వఁడు నెఱుఁగలేడు. బాల్యంబునుండియు నెన్నఁడును నెడఁబాయని మామిత్రత్వమునకు భంగము గలిగినది. ఆహా! మిత్రునిపైఁ ప్రేమ యెంత చేసినది. సన్యాసి వేషముగూడ వేయించినది (పరికించి) ఇది యేకదా. నామిత్రుడగు జయంతుని భార్యాగృహము. ఆతనిపైనుండు ప్రేమను వీడలేక యత్తవారింటి కరుదెంచినతని కెఱుకలేకుండ వెంటఁబడి వచ్చితిని. ఇప్పుడు నేనేమిసేయుదు? (ఇంచుక యూరకుండి) చేయుటకేమున్నది. ఈయరఁగు పైఁబరుండెదను (అనిపండుకొని)

మ. సతతంబుఁ ఘనమైత్రి పెంపెసఁగ మేల్ శయ్యాతలంబందు నా
క్షితిపాలాత్మజుతోడఁ బండుకొనుచుఁ బెల్వొందు నేనిప్డు డా

హితుఁడై ప్రేమను వీడలేక యకటా ! యీరాతి న్నెపైఁ బండితిన్
స్థితి కేమందును జెప్ప గాదర మొకో ! స్నేహానుబంధంబునన్.

ఎన్నటికైనను స్నేహితునితోఁ గలసి సంభాషించు భాగ్యంబ బ్బునా; ఆభాగ్యంబు లేకపోయినను నాతని ముఖకమలసందర్శనంబుచే తనైనను నామనస్తాప మొకింత పోగొట్టుకొనుచుందు. (ఇంచుకయూరకుండి) ఆహా ! నిద్రపోవుచున్నను రాకున్న దికదా. నిలుచున్నను, గూరుచున్నను, మేల్కొనియున్నను, శయనించుచుండినను, మిత్రుని సంభాషణయే వినఁబడుచుండును, (జయంతునుద్దేశించి)

క. నడచితివె నీమాటల
కడుగైనం దాఁటి యొప్పు డతికూర్రుఁడవై
ముడిచితివే పరధనముల
విడనాడఁగ నేటికయ్య వీరచరిత్రా.

ఇంతకును మనమైత్రిని భంగము సేయుట కాహారాంగనయే ముఖ్యకారణము. (మోహినినుద్దేశించి)

తే. గీ. పరఁగ జయపాలజయంతుల భవ్యమైత్రి
లతను ద్రెంచివేయుటకునై క్షితితలమున
బుట్టితను బొందియుండెఁగా బోలు నకట
నిక్కముగఁ జూడనీ మోహి నీగజంబు.

(జయంతునుద్దేశించి) సఖా ! జయంతా ! పరిపూర్ణజ్ఞానసంపన్నుఁడవగు నీవుకూడ నజ్ఞానాబ్ధిలోఁ బడితివే. నాపలుకులనించుకయు నమ్మకపోతివి. అక్కటా ! నామైత్రి వీడితివి. (అంతలోఁ దలుపుదీయు చప్పుడు వినవచ్చును.)

జయపా—(తలుపులు చప్పుడువిని) తలుపుచప్పుడగుచున్నది. ఎవరైన నివతెలకు వచ్చుచుండిరి కాఁబోలు. ఇచ్చట శయనించియున్న

నన్నుఁజూచి యేమియు ననరుకదా. సన్యాసివేషధరుండనై యున్నన న్నెవ్వ రేమననెంతురు ?

ప్రిభా——(తలుపుఁదీసికొని రాజవీధిలోనికివచ్చి) ఆహా ! నేఁడెంతయుఁ బ్రొద్దుపోయినది, నాథుఁడు వచ్చియుండుటచేతఁగదా యిట్టులాలస్యమైనది. ఇందుకా మేదరి యెంతయాగ్రహించునో. కానిమ్ము. త్వరగాఁబోయి నాథుఁడు నిద్రనుండి లేవకపూర్వమే యరుదెంచెద (నడచుచున్నది)

జయపా——(ప్రిభావతినివిలోకించి)ఏమిదీ! ఆశ్చర్యముగనున్నది. ఈతరుణీమణి యెవ్వరో యొంటిగా నెక్కడికో పోవుచున్నది. (ఆలోచించి) అంతఃపురపరిచారిక కాదుగదా. అ..యినచో నర్ధనిశీధమందుఁబోవనేల? నామనంబునందణుమాత్ర మనుమానముజనించుచున్నదిఎవ రైననేమి? ఈమెయెక్కడికేఁగునో! నీమెకెఱుక లేకుండ వెంటనేఁగియుదంతం బారసెద. (అని నడచుచున్నాఁడు.)

(అంత తెర లేచును.)

(మేదరిగృహము).

ప్రవేశము —— మేదరి వెంకఁడు.

(తనలో ఆకసమువంకజూచి) అబ్బో ఆకసానపిల్లలకోడి నచ్చరత్రం అపుడే చాలదూరం పోయింది నాముద్దులమితారి పభావతిసాని యింకనూ రాకున్న దే! ఆయంచగున్న యిప్పుడేఒచ్చునోయిక నేఒచ్చునో యని చూడలేక నాకన్నులు పొడికన్నులైపోయినవి అబ్బబ్బా పానింయి సుగుంకొందిగంద! మా రాస్యం ఓఁకికెలలేమకద ! తెలిస్తే నాపాణాలు పోయినట్టే సందేలమా రాచోరి పిల్లతో పొత్తు పాణాలు తీస్తాదేమో అని బయంఅగుసుండాదికాని ఆలేతమూవిసిగురు బోలు ఆ మొయ్యారి బామనుతలుచుకుంటె నావళ్ళంతా కాకరకాయలాగున జలపరిస్తాది యిరాళిమెన్నాతాది కళ్ళెర్రిబడతాఉ ఆజాయనినాకు పిచ్చెత్తుతాది

కరచేపాము కొట్టేభూతము కానరాదు. నిషాలెక్కుతాయి. కూడుసై చదు. ఏమి సేయను మరి కాని, నిజానికి తలిస్తే మొదవపనే కాని ఓడిపెళ్ళాన్ని మరోడాతగులాడ్కొని సిగ్గులేక నాని బాని మొందరు పోకిరిలంజకొడుకులు నావంటివాళ్ళున్నారు యింతకూ నాపున్నెంసేత ఆరాసపిల్ల నాకు లబించిందికాని అందరికి లబిస్తుందా. నాపున్యెం నా బాగ్యెం. నాఅదరోట్టం. మంచిదీ ఏం సెప్పమూ. యీయాలింతాలస్యం దానిమొగుడుగీనిరాలేదు గంద (ముందుచూచి) అదిగో అదిగో నామిటారికత్తె నాగురివిందపూల బంతి తక్కుచూతాగుచూ వస్తోంది. రాని దీనితస్సాజెండా నాతడాఖా చూపిస్తాను.

[జయపాలుడు రహస్యముగ వెనుకనుండి వచ్చుచుండ ప్రభావతిప్రవేశము.]

వెంకడు.—అదిగో అదిగో నారతనాలమూటవచ్చినది రారా అయితే ప్రభావతీ నేడింత జాగేలసేసినావో చెప్పుమా?

[కనబడకుండ దాగియుండును.]

(6) పాట—వెంకడు—బారువ-ఏకతాళం

1 ఓసోసి రాసపిల్లవొచ్చేసినావటే। చూసుకోవె నాదీతమాస॥ ఓసిపిల్ల॥ చూసుకోవె నాదీతమాస॥ నిసిరేతిరాయెకదె। నేడేలరావే। వసివాడినానేయీయాల॥ ఓసిపిల్ల॥ వసివాడినానేయీయాల॥ యిప్పుడేవస్తావో యికనేవస్తావో। యెదురొచ్చిసూసూతున్నానే। కాసింతసప్పుడైన నీవానుకోంటినే। చొప్పుతగ్గిపోయె। చూపుతాలగిపోయె। యొప్పూలకుప్పా రాగదవే॥ ఓసిపిల్ల॥

2 యీయెదురుబడ్డాతో। యీపుపెట్లగొడతాను। ఏమేయింతాజాగు సేయూ॥ ఓసిపిల్ల యేమే యింతాజాగు॥

ముద్దులిత్తానంచు । మురిపేముంటో నుంటి । సుద్దులాడావేమె శోభా
నము రావె । ముద్దూలాగ పల్కవేమె । ఓసిపిల్ల గద్దారితనమా కె
నాకో । నీవింత పొద్దూపుచ్చావే లెచిలుకా । సెప్పవేమి ॥ఓసోసి
రాసపిల్ల॥

వెంక—(పరిభావతిం జూచి) అన్నులమిన్నా । నేడింత యాలస్యమైన దేమి?

జయపా—(స్వగతము) ఈమెమాత్ర మెవ్వరో తెలియకున్నది. వీడుమాత్రము మేదరియని తెలియుచున్నది. అయినను నీమె యేమి ప్రత్యుత్తరంబిచ్చునో చూచెదను.

పరిభా—ఓయీ! మేదరనాయకా! నేటిదినంబున నాభర్తయు రు దెంచుటంజేసి యాలస్యంబైనది. కావున క్షమింపుము.

జయపా—(తనలో) హా! తెలిసినది. ఈమె తప్పక యీపురంబు నేలు రాజునకుం బుత్రియు, నామిత్రుండగు జయంతునకు భార్యయు నైయుండును. "నాభర్త నేటిదినంబున వచ్చుటంజేసి యాలస్యంబైన ది" యని వక్కాణించుచున్నది. నేటిదినంబున నిచ్చటికివచ్చినది నా మిత్రుండే కదా.

తే. గీ. నీచ మతినీచమంచును ♦ దోఁచనీయ
దెట్టిదుర్మార్గకార్యంబు ♦ నేనిసేయ
బుద్ధిపుట్టించుచుండును ♦ మోహ మహహ
యెట్టివారలకైనను ♦ నెంచిచూడ.

అయినను ముందుగఁ దొందరపడనేల. ఇంకనునీమెసంభాషణ
విందును.

వెంక—ఏమీ! నీమగడేవచ్చినాడా! జయంతుడేనా?

పరిభా—కాక మరెవ్వరు!

జయపా—(తనలో) ఇప్పటికి స్పష్టమయినది. ఈతరుణిజయం తుని భార్యయే. అక్కటా! ఇందుకేమనిచింతింతు.

మ. జననంబందెను రాట్కులంబున మహా | సౌభాగ్యముఁ గాంచిను
ర్జ దూరుండగు మాజయంతునకు భా | ర్యారత్నమై వేసవేల్
వసితల్ భక్తిమెయిఁ నిరంతరము సే | వల్ సేయుగానుండు, ని
వ్వనితారత్నము సిగ్గులేక యకటా | భావ్యంబె యిట్లుండగన్.

ఆహా! పావనంబగు వంశంబునఁ గళంకముపాప్తించుట యిట్టివారి వలననేకదా.

క. ఎక్కడ రాడ్వంశము మరి
ఎక్కడ మేదరకులంబు | నింతేనియు లో
నక్కట సిగ్గునుబూనక
యిక్కన్నియ పీనిఁగూడు | టెడ తలంపన్.

(పరిభావతి నుద్దేశించి)

తే. గీ. నిన్ను గుణరాసిగానెంచె | సిధపుండు
కులటవై యొప్పుచుంటివి | కోర్కిమీర
నుభయకులంబులకీర్తికి | నుర్విలోల
భంగముఁ గల్గఁజేసితె | పాపచిత్త.

ఓసీ! ఛండాలి! నీవు వేశ్యవై జన్మించుటకు మారుగా సుక్షత్రియకాంతవై పుట్టితివి నీమూలంబున నెంతమందికి దుర్యశంబు సంభవించునో యెఱుఁగలేకపోతివి.

వెంక—నీభర్తయేవచ్చిన నీవునాకడకిక రాకుము. నీదారినీవి నాదారినాది వేగపొమ్ము.

పరిభా—నిన్ను నమ్మియున్న నన్నుఁ గన్నచూపునఁ జూడన్యాయమా. నీవేనాకు బాపని మది సంతోషపడుచుంటి.

జయపా—(తనలో) ఆహా ! ఈకులటయెంతసిగ్గువిడిచిపలుకుచున్నది. తుచ్ఛుండగు వీనిసంగతి నెడబాయలేక యెట్టికర్ణకఠోరమగు పల్కుల నగ్గడించుచున్నది. అక్కటా ! భగవంతుడీమోహమునుదాని నేల సృష్టించెనోకదా !

వెంక—ఇంకనిన్నాతడు తనయింటికి తీసికొనపోవునుగదా యిక నీకునూ నాకునూ యెట్లుపొత్తుకలుగును ?

ప్రభా—నిన్ను విడనాడి యేగుదుననుకొంటివా. అట్లెన్నటికిని తలంపకుము.

వెంక—వెళ్లకయేమి చేసెదవు ?

ప్రభా—మరియొకప్పుడు వత్తునని పలికెదను

జయపా—(తనలో) ఈజారిణి భర్తలేనంతకాలంబును వీనితో సుఖంబుగ వర్తించుచున్నది. ఇప్పుడుకదా సతులనుబుట్టినింటకడపెద్ద కాలముంపఁగూడదని నాకుఁదోఁచినది. ఉంచినను నందఱునిట్లేయైన తురా ! ఎక్కడనో యిట్టిదుష్టచిత్తులుందురు.

వెంక—ఎప్పటికైన నివత్తవాఁటింటికేగవలసినదానవేకదా ?

ప్రభా—అట్లయినచో నిదగ్గఱనున్న కత్తినాచేతికొసగుము; చిత్తంబున భీతిలేక నిదురించుచున్న నానాథునిఁ జంపివచ్చెదను. పిదప మన మిచ్ఛాలీల వర్తింపవచ్చును.

వెంక—అట్లుతప్పక చేసెదవా ! అటులైనచో గానిమ్ము.

జయపా—(తనలో)

మ. కులటా ప్రాణధవుఁ వధింప మదిలో గోర్కెన్ విలోకించితే
తులువా! మేదరి! భీతిలేదె యిటు నీ కోర్కెఁగూడియున్నట్టియీ
లలనన్ భర్తనుజంపి రమ్మనుచు నా శ్లాఘ్యంబునం జెప్పుదే
యిల మిమ్ముద్దఱిజ పిన్న విన్నఁ డఘుం బింతేనియున్ రాదుగా.

(7) సాంగు—జయపాలునకు కమాచి . అటతాళం.

1. ఎంతకైనను తగినదానవె । యితిభర్తృనాశినీ । కాంతునొంతుక గోయనెంతటి । కార్యమున్ దలపెట్టితే॥ ఎంత॥

2. మేకవన్నెల పులివివైపతి । మ్రింగజూచితె ఘాతకీ । నీకు నో మేదరిని గూడుచు । విభునిజంపగ నెంచితే॥ యెంత॥

3. అక్కటా స్త్రీజాతి ధారుణి । నెంతకైనను జాలదే । మక్కువలు చూపించి విషమయ మానసంబున జెలగదే॥ ఎంత॥

(ఇంచుకయాలోచించి) ఆహా! కలికాలంబున నెన్నిచిత్రంబులు గనుపించుచున్నవి. స్వమతస్వగౌరవాభిమానంబులడుగంటినవి. లజ్జవిడ నాడఁబడినది. సజ్జనులకు హాని తేఁదలంచుదుర్మార్గుల నెకులు ప్రబలిరి కూటసాక్ష్యంబులొసంగి ధనంబుగొనుచు మహానుభావులమని విఱ్ఱవీగు నవివేకులా పెక్కుమందికలరు. ప్రార్థనలంగీకరింపక, తుదకు దానికిఁ బ్రత్యుత్తరంబైనను, నిచ్చె నేని పరువుపోవు నేమోయనితలంచుచు, మంత్రిలహస్తంబున బొమ్మలులాగున నాడుభూనేతలు వెలసినారు. గురుశుశ్రూష జేసి సమస్తవిద్యల నభ్యసించి తుదకు గురువులపైఁగాలుద్రువ్వ గోరుశిష్యులుప్రబలుచుండిరి. పెద్దపెద్దయుద్యోగంబుల గాంచికొందఱుకుమతులు తమభార్యలయెడ జేయుదుర్మార్గకృత్యంబులుదలంపరాదుకదా. పతిసేవవిడనాడి స్వైరిణీవృత్తిబూని చరించు సంసారతరుణులుసిగ్గులేక మందమందలుగ బయలుదేరుచుండిరి. నేఁడువిటకానిపైఁబ్రేమచేఁ దనభర్తనుగూడ,జంపఁదలంచుగాంతను గన్నులారఁ గంటిని. ఓహో! ప్రపంచంబున నింక నెన్నిమాయలు కలవో!

ప్రభా—మేదరనాయకా! ఆలోచింపకకత్తినొసంగిపంపుము.

వెంక—(కత్తియొసగి) ఇదిగో సివికార్యమేలాచేసెదవోయమా యెవ్వరికైన తెలిసినచో నీమాటకేమి ముందునాపుట్టిమునుగును ఏలాగైన నీమగని తుదముట్టించినచో మనము యిచ్చవచ్చినట్లు తక్కరబిక్కరలాడుకొనుచు ప్రాణాలున్నంతవరకు హాయిగానుండవచ్చును.

ప్రభా—అతరహాస్యము గజరిపివచ్చెద (నిష్క్రమించుచున్నది)

వెంక—(నిష్క్రమించుచున్నాఁడు)

జయపా—(స్వగతము) ఈపాపాత్మురాలీతుచ్ఛుని బొంకుమాటకై భర్తఁజంపుట కేగినది. ఆహా! నాప్రాణమిత్రుండగుజయంతుఁడు భార్యహస్తంబున మడియునా. అక్కటా! ఇప్పుడేమిసేయుదును ? (ఆలోచించి) దీనికి నాలోచింప నేల?

తే. గీ. ప్రాణమిత్రుని వేగ జం పంగనున్న
యతివనిప్పుడు వారించి యనుఁగుసఖుని
ప్రాణములగాచి వెలయుటే భవ్యమార్గ
మంచు జిత్తంబునందుఁ దలంచువాఁడ.

కావున నేమాత్రమును జాగుసేయక సీమెవెంట నేఁగి యెట్టులైనను నాప్రాణమిత్రుని ప్రాణంబుల గాపాడెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము:—ప్రభావతిసౌధము.

ప్రభావతి—(ప్రవేశించి తలుపుదీసి) అందఱును నిద్రావస్థనే యున్నారు. నాకార్యము నెరవేర్చుకొనవచ్చును. (అనినిద్రించుచున్న జయంతుని సమీపించి) ఆహా! ఇప్పుడు నేసీతనిజంపవలసినదేనా. ఇట్లాచరించితినేని యీతఁడు మడిసి యనంతము నామొగంబుజూచువారెవ్వరు? వితంతువునై యొరులకంటఁ బడఁగలనా. భర్తనుజంపిన మహాపాతక మెన్నటికైననుబోవునా. ఒకవేళ ప్రపంచంబున కీసంగతిముందుముందు దెలిసెనేని నన్ను నిందింపరా. కావుననీకార్యము సేయకుండుటయే మేలని తలంచెద. (ఆలోచించి) ఇప్పుడీకృత్యంబు సేయుట మానితినేని మేదరిస్నేహాముసకు భంగమువచ్చును. అతనిబాసి యొక్క త్రుటికాలంబైనను మనఁగలనా కావున నేననుకొన్న కార్యము చేసితీరెద. (కత్తినెత్తి) శరీరము కంపమెత్తుచున్నది. హృదయంబున ధైర్యమాగుట

లేదు (ఇంచుక యూరకుండి) అక్కటా! ఎంతపాపకార్యము సేయఁదలం
చితిని! భర్తను జేతులారా జంపఁదలంచుచుంటినే. (ఆలోచించి) ఇంక నా
లోచించినచోఁ బ్రయోజనము లేదు. ఆలస్యంబైనచో ముప్పువాటిల్లు
ను. ఏమైనసరే వధించితీరెదను. (జయంతునికంఠంబునటికి వేయును)

జయపా—(తొందరగాఁ బ్రవేసించి)

శా. ఘోరంబైన ఖరాసిబూని మదిలో నెగ్గింకేమియుఁ లేక యీ
మారాకారు వధించి మేదరికుల న్బ్రావిర్భవుల్ గూడగా
ధీరత్వంబున నెంచినట్టి నిను నద్రిన్ నే నిఁకన్ రింపఁగా
జేరన్ వచ్చుచునుంటి చంపకుమి రా నేజీవాత్మప్రాణేశ్వరుఁన్.

(ప్రభావతి కరము పట్టుకొనుచున్నాఁడు.)

ప్రభా—(జయపాలుఁ జూచి)

చ. ఎవఁడవురోరి నీవిటు లానెకింతభయంబును బూనకుండ, భూ
ధవసుత సౌధరాజము ముదంబునఁజొచ్చి కరంబుబట్టుదే.

జయపా—

ఎవఁడనునైననేమి రమణీ పతిఁజంపగనున్న నిన్ను భూ
ధవునకుబట్టియీయఁగ ముదంబున వచ్చితి నిట్టిరూపుతోన్.

(8) సాంగు జయపాలుడు జంగలారాగం - రూపము.

1 ఛీఛీ కులపాంసనీ। పతి। జెండినావా కో। నీచు మేదరి కై దు
ర్నీతి బూనెదే॥ ఛీఛీ॥

2 గౌరవరాజకులాంబుధి। గరళమువంగి। మారణకారణనై జన్మం
బుగాంచితే॥ ఛీఛీకుల॥

3 నీకతన రాజవంశ నీతిమాసెనే। లోకము నీయపయశము నిండ్ల
మయ్యెనే॥ ఛీఛీకుల॥

(చచ్చిపడియున్న జయంతునిజూచి) హా! కులటా! నేను రాకము
ను పేయంతంబు నొందించితివా. ఛీ! పాంసురాలా! ఎంతక్రూరకృత్యంబు

గావించితివి! నీచకులుండగు మేదరింగూడి సౌఖ్యంబులందఁదలంచి యిట్టి క్రూర కార్యం బాచరించితివా. ఈపనినీవు జేయుచుండ నెవ్వరుఁజూడరని తలంచితివి కాని యంతరిక్షచరులగు సూర్యచంద్రాదులకెఱుక లేనిదీప్రపంచంబునందుండునా. ఓసీ! పాపాత్మురాలా! తుచ్ఛంబగు నిహాలోక సౌఖ్యంబుల కాసించియెంత దుష్కార్యంబొనరించితివి. ఈపాపమునీకెన్ని జన్మంబులకైనను బోవునా. నీవుబుట్టుటం జేసివంశంబునకుఁగూడ నపకీర్తి వచ్చినదే. ఒకొక్కసమయంబునందుఁగట్టికి వానికినైనను గొఱ్ఱెఁగోయు టకుఁ జేయిరాకుండును అట్టియెడ దైవసమానుఁడగు ప్రాణనాథునికంఠము తరుగుటకు నీచేతులెట్లాడెనోకదా. అవును మోహామే చేతు ... డించును. కరకుతుఱకగర్భంబునఁ బుట్టుటకుమారుగా రాజవంశమున జన్మించితివిగాని. రాజపుత్రికాగుణంబులుమాత్రముకంచుకాగడఁబెట్టి వెదకినను గానరావు. జారిణివై ప్రాణేశ్వరునిఁ జంపిననిన్ను ముక్కముక్కలుగాఁ జెక్కినను పాపంబు సంభవింపదు. (జయంతునిజూచి)

తే. గీ. అనుఁగుసఖుడ! కులట భార్య ♀ హస్తమందు
బ్రాణముం బాసిపోతివే ♀ పరమమిత్ర
నన్ను విడనాడి కృపలేక, ♀ యన్న ! నిన్ను
గానఁజాలనైతిని కాల ♀ కర్మగతిని.

హా! మిత్రశేఖరా! మనస్నేహాభంగ మెంతచేసినది. నీస్నేహము వీడినప్పుడే బ్రతుకుట దుర్లభంబనితోచిన నాకు నీవుస్వర్గపురంబున కేగుట కనులారాజూచి ప్రాణములతోనిల్వగలనా? అయ్యో! నన్ను మఱచిపోతివా. నేనెంత బ్రతిమాలుకొన్నను నావాక్యంబుల నాలింపక నన్ను ద్రోసిపుచ్చితివి. అయ్యో! నాగతి కేమనివగతు, నీవులేని యీజన్మము నాకేల? అతిమృదువైన నీకంఠము కులటయగునీభార్యనఱుకుచుండ నీవెట్లోర్చితివోకదా.

ప్రభా—(తనలో) ఈతఁడెవ్వఁడో తెలియకుండెను. ఇప్పుడు నేను మాటాడక యూరకుంటినేని యిప్పుపాటిల్లును, కావున నొక్క చిత్రమును బన్ని యాతనిని రాజభటుల కప్పగించెదను. (ప్రకాశముగా) ఓహో! రాజభటులారా! ఎవ్వఁడో యొక్క దుర్మార్గుండు భీతిలేక నాసౌధమును జొచ్చి నిదురించుచున్న నాభర్తను జంపుచున్నాఁడు. సత్వరంబుగ వచ్చి రక్షింపుఁడు రక్షింపుఁడు.

(అని బిగ్గరగాఁ గేకలు వేయుచున్నది.)

[అంత నిరువురు రాజభటులు ప్రవేశించుచున్నారు.]

రాజభటులు—(తొందరతో) ఏఁడీ! ఆతుచ్ఛుఁడు.

ప్రభా—అతఁడే. ఆతఁడే.

జయపా—(స్వగతము) ఆహా! కాంతలెంతకైనను జాలుదురు. ఈటక్కులాడి యెంతమాయపన్నినది. అక్కటా! యిప్పుడు నేనేమి చేయుదు (ఆలోచించి) చేయుట కేమున్నది. ఎట్టియవస్థలు ప్రాప్తించునో వానినన్నిటిని ననుభవించుటకు సంసిద్ధుఁడనై యుండుటయే కర్తవ్యము. (ప్రకాశముగా) రాజభటులారా! మీరాలోచింపనవసరము లేదు. ఈరాజనందనునివధించిన దుర్మార్గుఁడను నేనె నన్ను మీయిచ్చవచ్చినట్లు చేయవచ్చును.

రాజభ—రమ్ము. నిన్ను మేమిప్పుడు కారాగృహంబునఁబడవైచి తెల్లవారినపిదప రాజుగారి సన్నిధిం బెట్టెదము. (అనిజయపాలుని గారాగృహంబునకు దోడ్కొనిపోవుచున్నారు.)

ప్రభా—ఇప్పటికి నాహృదయము చల్లఁబడినది.

(నిష్క్రమించుచున్నది)

ఇది ద్వితీయాంకము.





# సంగీతజయంతజయపాలము.

## తృతీయాంకము.

[కారాగృహము.]

జయపా—(తనలో) కట్టా! తుదకు నాయవస్థయిట్లుగాఁ బరిణమించినది

(౪) నాంగు—జయపాలుడు సింధుకమాచి, ఆట - పామగయే.

1 హావిధి చైదములు। ఆశ్చర్యములు॥ హావిధిచై॥
పున్నెముసకునే। బోవ పాపమెదురయ్యె। యెన్నరాని। బన్న
మందితి॥ హావిధి॥

౨ సతులమాటలనే। సత్యమంగురుధాత్రి। అస్మృతము కాపుర్షులా
డిన మాటలు॥ హావిధి॥

దీనికంతకును వగవనుగాని మిత్రుని మరణంబునకు మాత్ర
మునగచుచుంటిని. (ప్రభావతినుద్దేశించి) హా! చపలచిత్తా! జారిణీ! గో
ముఖవ్యాఘ్రిమా! ఎంతటిదానివే. రాజభటులకడ నెట్టిమాయ బన్ని
నన్ను కారాగారనివాసునిగాఁ జేసితివి. ఆసమయంబునకుఁ దప్పించుకొ
నుటయే ప్రధానంబని తలంచితివి గాని నెమ్మదిమీఁద సత్యముబయలు
పడునని యెఱుంగ లేకపోతివి, నిరతంబును జయంతునిగలిసి చరియిం
చు నేనిప్పుడొంటిగ నాతనినిస్వర్గంబునకుబంపి సంచరించుచుంటినిగదా
నందనోద్యానంబులందు విహరించు నేనిప్పుడె కారాగృహంబునందు
విహరించుచుంటిని. అవును. పురాకృతప్రారబ్ధ మనుభవింపక తీరునా.

వీరసేనుఁడు.—(ప్రవేశించి) కారాగృహంబునందున్న సన్యాసి
జయంతుని నర్ధరాత్రియందు వధించెనని తేఁబడిన నేరమును మాతండ్రి

గారు విచారణసేయఁబోఁగా నేను వారినివారించి యందలి నిజంబు నా రసెదను గావున మూఁడుదినంబు లందుకు గడువీయుఁడని కోరఁగా వా రందులకు సమ్మతించిరికదా. (ఆలోచించి) ఆసన్యాసి యేమి? అర్ధరాత్రి యందు నిర్భీతితో రాజపుత్రికాసౌధంబుఁజొచ్చి జయంతుని వధియింపుచుటేమి. ఇది నాకు మిక్కిలి యనుమానముగనున్నది. కావున నిందలి నిజమైనయుదంతం బీసన్యాసి నేకనుఁగొనవలెను. (సన్యాసినిసమీపించి)

తే. గీ. నీదురూపంబుజూడ ను ♦ నీందుభాతి
గానుపించుచునుండెను ♦ కరుణలేక
చెఱను బడవైచె నెవ్వఁడు ♦ చెప్పుమయ్య
సంతసంబునుగూర్తు నీ ♦ స్వాంతమునకు.

జయపా—

తే. గీ. నీవు వచియించినట్టుల ♦ నేను మునినె
కాని నానుపురాకృత ♦ కర్మవశము
చేతఁ బొందఁగాఁగలిగితి ♦ జెఱను; నేమి
పల్కుటకు నోరురాదయ్యె ♦ భవ్యచరిత.

అయ్యా! నాయందుఁ గృపాంతరంగుడవై నా క్షేమమాలింప నెంచిన భవదీయనామంబెద్దియో తెలిపి నన్నానందపఱచెదవా?

వీర—ఓయీ! నేనెవ్వరినో కనుఁగొనలేకుంటివా. ఇప్పట్టణాంబేలుమహీపతికి నాత్మజుండనగు వీరసేనుఁడ.

జయపా—రాజకుమారా! అట్లుయినచో నంతయుఁదెలిసియుండియు నడిగెదవేల? నీసోదరీ సౌధంబు నర్ధరాత్రియందుఁజొచ్చియామె భర్తను జంపితినని నన్ను జెఱసాలయందు వైచినసంగతి నీ వెఱింగినది కాదా.

వీర—జయంతుని నీవు వధియించినది నిజంబేనా?

జయపా—నిజముగనుక నే నాకిట్టిశిక్ష విధింపఁబడినది.

వీర—ఆషలుకుల కేమిలెమ్ము. నీవు సన్యాసి వేషధరుండవగు నొకక్షత్రియకుమారునివలెఁ గాన్పించుచుంటివి. నీవేషము నేటికి ధరించితివో చెప్పుము. నీస్వాంతంబున భీతిజెంద నవసరము లేదు.

జయపా—అయ్యా! నానిజవర్తమానమునతో నీకేమిపనియున్నది?

వీర—జయంతుని వధనుగూర్చి నాకనుమానము బుట్టుచున్నది. ఆకారణంబున నిన్నడుగుచుంటి సందియంబుండక వచింపుము.

జయపా—సందియ మేమున్నది? ఆతని వధించిన పాపాత్ముఁడను నేనే.

వీర—నీవు వచించిన వాక్యంబు నేను నమ్మజాలను. ఈసంగతినిగూర్చి మాతండ్రిగారు విచారింపఁ దలచియుండఁగా, నిందలి నిజంబు నేను గనుఁగొనెదను గాన మూఁడుదినంబులు గడుపీయుడనికోరితి. అందులకు వారు సమ్మతించిరి. ఆకారణంబున నేనిప్పుడిచ్చటకువచ్చితి. కావున నిందలి సత్యంబంతయు నీ వలనఁ దెలిసికొనవలెను.

జయపా—జరిగిపోయిన దానిని నీవు మరల బయలునకుఁ దేఁదలఁచుచుంటివే. అనవసరముగ లేనిపోని శ్రమ యేలపడెదవు?

వీర—వమియు నెఱుంగని నిన్నన్యాయముగఁ జెఱబడవైచినందు కెంతయు విచారించుచున్నాఁడ.

జయపా—జయంతుని నేనువధింపలేదని నీకుఁదోచుచున్నదా?

వీర—నిస్సందేహముగ.

జయపా—ఎవరు వధించిరని నీకుఁ దోఁచుచున్నది?

వీర—స్త్రీలు కడుసాహసులు కదా. ఎప్పటికెట్టిమాయబన్నుఁగలరో యెవ్వరెఱుంగుదురు?

జయపా—రాజకుమారా! నీబుద్ధికి సంతసించితి. ఇందలి నిజంబు నీకు రేపురాత్రి నాకడ కరుదెంచిన యా రేయియంతయు నాతోనుంటివేని తెలియఁ జేసెదను పొమ్ము. (నిష్క్రమించుచున్నారు.)

రంగము—ప్రభావతిసౌధము.

[వీరసేనుఁడు, జయపాలుడు ప్రవేశించుచున్నారు.]

వీర—నన్నిక్కడకుఁ గొనితెచ్చితివేల? ఇదిమా ప్రభావతిసౌధమే.

జయ—చిత్రమగు నాటకంబంతయు నీస్థలంబునుండియే నీవు వీక్షించెదవుగాక. నేజెప్పినట్టుమాత్రము చేయుచుండుము. సమస్తము ను నీకు విశదము కాఁగలదు. మనమీ యరుగుమూలను పరుండి యుందము. పిమ్మట నేమగునో చూచుచుండుము.

వీర—నీవు చెప్పినయట్లే చేయుదము.

[అంత నిరువురు అరుగుపైఁ బండుకొనుచున్నారు.]

(అంత తలుపు చప్పుడు వినవచ్చుచున్నది)

వీర—ఓయీ! తలుపుచప్పుడు వినవచ్చుచున్నది. ఎవరైనను మనలఁ జూచి యాగవాలు పట్టరుకదా.

జయ—మనల నెవ్వరును నేమియు ననరు. నీవు చూచుచు మాటలాడక యూరకుండుము.

ప్రభావతి—(తలుపు దీసికొని రాజవీధిలోనికివచ్చి) ఇంక నేను మేదరిగృహంబునకేఁగ సత్వరంబుగ పోవలెను. (నడచుచున్నది)

వీర—(జయపాలునితో) ఏమీ! ఆశ్చర్యముగనున్నది. ఈమె నాసోదరియే. ఈయర్ధరాత్రంబున నెక్కడికేఁగుచుండెనో కదా! కనుఁగొందునా!

జయ—నీవేమియుఁ జేయఁగూడదని చెప్పియుంటిని కదా. అట్లమైనఁ జేసితివేని నే కారాగృహంబులోనికిఁ బోయెదను.

వీర—ఏమియుఁ జేయును. నీయాజ్ఞప్రకారము వర్తించెదను. ఇంక నిప్పుడేమి చేయుదము?

జయ—ఇప్పుడు మనమీమె వెంట నీమెకుఁ గనఁబడకుండ నేఁగ వలెను. తరువాత నీవే చూచెదవు.

(ఇద్దఱును పద్మావతికి గనఁబడకుండ నడచుచున్నారు)

వీర—మిత్రమా! నామనంబంతయు డోలాయమాన మగుచున్నది. నాసోదరి నిర్భీతిగ నర్ధరాత్రంబున నొంటరిగ నింతదూరం బరుదెంచినది. ఇప్పుడు మేదరిగూడెము ప్రవేశించుచున్నాము. ఛీ! ఇక్కాంతయిక్కడికేలవచ్చుచుండెనోకదా! స్నేహితుడా! ఇంక సంశయింపక నీఖడ్గంబుచే నీమెను నఱికి వైతునా.

జయ—అదియే కదా వలదని చెప్పితిని. అట్లయినచో నాదారి నేఁబోయెద. నీయిచ్చవచ్చినట్లు చేసికొనుము.

వీర—మాట్లాడను. లేదు. లేదు.

[తెరలేచును.]

మే ద ర గృ హ ము.

వీర—ఆహా! ఏమిది! సిగ్గులేక నాసోదరి యీతుచ్ఛుని గృహంబు బ్రవేశించుచున్నదే. మిత్రమా! నాకుఁ గోపం బాగకున్నది. ఈకరవాలంబుతో నాసోదరి శిరంబును ఖండించుదునా?

జయపా—మాటిమాటికి నీవిట్లు పలుకుదువని తెలిసియుండెనేని నేను నీతో రాకనేయుందును.

వీర—ఓయీ! స్నేహితుడా!

తే. గీ. క్షత్రియాన్వయమందున ♦ జన్మనుంది
విమలకీర్తిపరుండైన ♦ పృథ్వీపతికిఁ
బుత్రియై; నీచు మేదరి ♦ పొందగోరె
నక్కటా చూచి సహియింప ♦ నగునెనాకు.

ఉ. స్త్రీవధ పాపమెంతయును ♦ జెందినఁ జెందఁగనిమ్ము నన్ను ధాత్రీవిభుఁ డుగ్రమూని యురి ♦ దీసినఁ దీయఁగనిమ్ము నల్వురున్
ఛీ! వెలఁదిన్ వధించెనని ♦ చెప్పిన చెప్పుకొనంగనిమ్ము; నే
నీవనితన్ వధింపకను ♦ నెంతయు సైపఁగజాల మిత్రమా!

ఆహా! స్త్రీలమాయ! "చేసెడివి మహాఘనస్నానములు. దూరెడివి దొమ్మరిగుడిసెలు." అనునానోక్తి యీచండాలియందుఁ గన్పట్టుచున్నది.

జయపా— నాయిచ్చవచ్చినయట్లు నీవు వర్తించెదవా! లేక నన్నుఁగారాగృహంబునకుఁ బొమ్మని యాజ్ఞయిత్తువా?

వీర— సఖుఁడా! నాసోదరి నాకనులయెదుట నిట్టిదుష్కార్యం బాచరించుచుండఁగా నెట్లూరకొనుమని చెప్పగలిగితివి? ఇట్టిదుశ్చారిత్రలను బ్రతికించకంబున బ్రతుకనిచ్చినచో వంశంబునకెల్ల దుర్యశంబు సంభవింపదా.

(10) పాట— వీరసేనుఁడు శుద్ధబంగాళా - త్రిశ్రజాతి.

1 కటకటకర్ణక । ఠోరపువాక్యము । లెటువినిసహించుతుగ ॥
అసులతో॥
సోదరినీచుని మేదరిగూడుట। చూడగలిగెఘనశోకము హెచ్చెను॥ కట

2 తలవంపులునాకు । గలిగెనేమిసేతు । నిలచరించుపగ । నింతయు సైపను॥

3 యీగతినామది । యెట్టికార్యమో । సేయగనోడునె । చింతలనయ్యెను॥ కటకట॥

జయపా— ఇప్పుడు నీవింతకొందరపడితివేని జయంతునివధను గూర్చి నీకు నిజంబెట్లు తెలియును. కావున నేమియు మాటలాడక నీ చాటునడాఁగి నీసోదరియు మేదరియుఁ జెప్పుకొనుపలుకుల నాలింపుము.

వీర— నీవు చెప్పినట్లే కావించెదను.

[వెంకఁడు— ప్రభావతి ప్రవేశించుచున్నారు]

వెంక— ఆ ఏంటీ! ఆపనికాజేసి వచ్చేసినారా. అమ్మగారో. సెరి పేయేశావా!

ప్రభా— అందుకు సందియమేమి?



వెంక — ఎలా సేశావో నాకుసెప్పుమా; యీమాట యింటేనా గుండెకాయలు మెడనులిమిన కోడిపిల్లలాగ కొట్టుకుంటున్నాది.

ప్రిభా — మొన్న రేయి సీయొద్దనుండి ఖడ్గముతీసికొనిపోయి, నిదురించుచున్న నాభర్తకంఠంబు ద్రెంచితిని. ఇంతలో నెక్కడినుండియో యొకసన్యాసివేషధరుండు వచ్చిభర్తనింకను జంపలేదనితలంచి వలదు వలదని పలికెను. పదపడి కొంతసేపటికి నానాథుండు చచ్చిపడియుంట వీక్షించి నన్ను నేక దుర్భాషలం బలికెను.

వెంక — ఓరిబాబో! కొంపముంచావా యేంటి! యీయేకాంతం బయలుపడలేదుగందా; నాసె గాలుకొట్టుకుంటూవుండాయి.

ప్రిభా — నేనంత పిచ్చిదాన ననుకొంటివా యేమి? ఆసన్యాసి నన్నట్లు దూషించునప్పుడు నాకేమియుందోచక నామనంబు డోలాయమానమై నారహస్యము బయలుపడునేమోయని భీతిజెంది యొక చిత్రిమగు మాయం బన్నితిని.

వెంక — ఆ! మాయేపన్నేశావు? ఏంసేశావు? అలాంటిహూంత కారివి కనుకనే యిందుకుసిద్ధపడ్డావు. ఆజాయినే జరిగింది సెప్పుమా.

జయపా — (వీరసేను చెవిలో కించి) రాజకుమారా! సావధానచిత్తుండవై వారిసంభాషణ నాలకింపుచుండుము.

ప్రిభా — అప్పుడునేను ధైర్యమునుబూని "ఓ రాజభటులారా! నాభర్త నిదురించుచుండఁగా నెవఁడో యొక్కదుర్మార్గుఁడు నాయంతఃపురంబుఁజొచ్చి యతనిని వధించుచున్నాఁడు. తత్క్షణంబె చనుదెంచియతనిని రక్షింపుఁ" డని బిగ్గఱగాఁ గేకలు వెట్టితి.

వీరసే — ఆహా! ఏంతదారుణ మెంతదారుణము.

తే. గీ. జారునింగూడ భర్తను జంపి; భీతి
లేక మానేర మక్కటా లేమమోపె

మరియొకరిపైన; మాయాప్రపంచమందు
నింక నెట్టివారుండిరో యెంచిచూడ.

ఓసీ! మాయలాడీ! ప్రభావతీ!

సీ. చిన్నారి పొన్నారి చిఱుతపాపవటంచు
దలపోసె; నీరీతిఁ దలపలేదు
సుగుణపుం బేటివై శోభిల్లుదువటంచు
దలపోసె; నీరీతిఁ దలపలేదు
పతిసేవజేయుచుఁ బరిఢవిల్లుదువంచు
దలపోసె; నీరీతిఁ దలఁపలేదు
దివ్యమాకీర్తిని దెత్తువటంచును
దలపోసె; నీరీతిఁ దలఁపలేదు

తే. గీ. కులటవై యిట్లు నీవిట్లుఁ గుతలమందు
సంచరించెదవంచును సంచితముగ
దలఁపగాలేదు నిరతంబు, తండ్రి; దుర్గు
ణంపు పేటివౌదంచు నాతిమిన్న.

(ఇంచుక యూరకుండి) ఆహా! స్త్రీ లెంతమాయలాండ్రు.

తే. గీ. లజ్జవిడనాడి విటకాండ్ర పజ్జజేరి
పైకిశ్రీరంగనీతులఁ బలుకుచుండు
తరుణులఁ బతివ్రతలటంచు దలఁచుకంటె
మోసమొండు గానఁబడదు భూమియందు.

జయపా—రాజనందనా? వింటివా! జయంత వధయందలి సత్యము.

వీరసే—ఏమియుఁ బల్కుటకు నోరాడకున్నది. ఈదుర్మార్గురాలెంతపని గావించెను. భర్తనుదాను స్వయముగా వధించి, వారించుటకు నేఁగిన నిన్నుఁ గారాగారనివాసునిగాఁ జేసెనుగదా.. అక్కటా!

ఎంతఘోరమగుమాయ బన్నినది. మిత్రమా! ఇంకనీవు నన్ను వారింపకుము. ఇట్టిదుష్కార్యం బాచరించుచు, వంశమున కపకీర్తి దెచ్చుచున్న యీపరమ దౌర్భాగ్యురాలిని నాకరవాలంబున ఖండించి కృతార్థుఁడనయ్యెద. (పరిభావతిపై కేఁగ నెంచుచున్నాఁడు.)

జయపా—నీవట్టికార్యమును జేయుట మంచిదికాదుసుమీ.

వీరసే—అట్లయినచో నీపరికార మాచరించెద. (అని రాజభటులను గట్టిగాఁబిలుచుచున్నాఁడు.)

వెంక—(పరిభావతినిజూచి) అదిగో ఏదో కొంపమునుఁగచావు అల్లరియేదోవిసబడుచున్నాది. నాకాళ్ళువడకుచున్నాయి నాపాణాలిమీదికొచ్చేసిందికాబోలురా బాబు. యెప్పుడీలాటి సంసారిఘాతలకి పోరాదురా బాబు.

పరిభా—నాశరీరంబంతయుఁ గంపమెత్తుచున్నది. అరుగో! యెవ్వరో యిరువురుపురుషు లాచాయ నిలబడియున్నారు. (పరికించి) అమ్మయో! ఇంకనేమున్నది. ఎవ్వరోయనుకొంటిని. నాసోదరుండగు వీరసేనుఁడును, మొన్న రేయి నాభర్తను వధించునప్పుడు వారింపవచ్చిన సన్యాసియు. అయ్యో! మనగుట్టు బయలుపడినది. ఇంకమన కేమిదిక్కు. ఇప్పుడెందుబోఁగలము. అక్కటా! ముప్పువచ్చినది.

[రాజభటులు ప్రవేశించుచున్నాఁరు.]

రాజభ—ఎవరు మనలఁబిల్చినది. (అని ముందున్న వీరసేనునింజూచి సమీపించి) మహారాజకుమారా! ఏమిసెలవు?

వీరసే—రాజభటులారా! ఆమేదరిగృహంబుననున్న కాంతామణిని, నామేదరిని దక్షిణంబ కారాగృహవాసులుగాఁ జేయుడు. ఇది యే యాజ్ఞ.

(రాజభటులు, పరిభావతిని మేదరిని గారాగృహంబునకుఁ దీసికొనిపోవుచున్నారు.)

రంగము:—రాజసభ.

[చిత్రకేతుఁడు, వీరసేనుఁడు, జయవర్మ, ప్రవేశించుచున్నారు.]

చిత్ర—కుమారా! వీరసేనా! అర్ధరాత్రంబునందుఁ గుమారి సౌధంబుఁజొచ్చి జయంతునిఁజంపిన యాసన్యాసింగూర్చి విచారింపనెంచిన దినంబు నేఁడేకదా. ఆనేరంబునందలి సత్యాసత్యంబు లరయుటకు మూఁడుదినంబులు నీవు గడువడిగితివి. నీవేమియాలోచించితివి ?

వీర—ఆలోచించుటకేమున్నది. అంతయుసిద్ధమయ్యేయున్నది. (ప్రక్కఁదిరిగి) సేవకా !

సేవ—(ప్రవేశించి) ఏమిసెలవు ?

వీర—నీవు కారాగృహంబునకేఁగి యక్కడి రక్షకభటులతో నిన్న రేయి కారాగారనివాసులుగాఁ జేయఁబడిన కాంతను, పురుషుని నదివరకున్న సన్యాసిని దోడ్కొనిరమ్మని రాజుగారియాజ్ఞగాఁ దెలిపి రమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

చిత్ర—వీరసేనా ? నిన్న రేయి, కారాగారనివాసులుగాఁజేయబడినపురుషుఁడును, గాంతయు నెవ్వరు ?

వీర—తండ్రీ ! అదియంతయుఁ దమకింకొక త్రుటికాలంబులో విశదముకాఁగలదు. ఇంతలో నేనువచించి తమచిత్తంబునకుసంతాపంబు జేర్పనేల ?

చిత్ర—ఇదివరకే వ్యాకులపడుచున్న నాకు మరింత సంతాపంబు గలుగునా ?

వీర—తమకే కాదు. ఈజయంతునివధ మనకుటుంబమునకంతకు సంతాపము గలుగఁజేయుచున్నది. సంతాపమేకాక మన రాజవంశంబునకెల్ల దుర్యశంబు దెచ్చినది.

చిత్ర—నందనా ! అదియెంచుక నాకుఁ దెలుపరాదా ?

వీర—అదిగో నేరస్థులను భటులు తోడితెచ్చుచున్నారు. సమస్తమును మనకిప్పుడే తెలియఁగలదు.

[సన్యాసవేషధరుఁడగు జయపాలుఁడు, ప్రభావతి, మేదరివెంకడు వెంటరా రాజభటులు ప్రవేశించుచున్నారు.]

చిత్రి—పుత్రికా! ఆమె మనప్రభావతియే కదా. లేక నాకట్లు తోఁచుచున్నదా. కాకున్న చోసదావస్థనుంటినా, కలగాంచుచుంటినా.

వీర—తండ్రీ! నీవు జాగ్రదవస్థయందే యుంటివి. ఆమె నా సోదరియు, నీపుత్రికయు నగు ప్రభావతియే. అందుకు సందియంబేమియు లేదు.

చిత్రి—కుమారా! నామనంబంతయుఁ గలతఁజెందుచున్నది. ఇదియంతయు వింతగాఁ గన్పడుచున్నది.

వీర—జనకా! ఈకలికాలంబున వింతల కేమికొదువ. ఇంకమనము ప్రస్తుతాంశమునుగూర్చి విచారింతము. దేవరవారు నాసోదరిని, నీమేదరివిగా రాగృహవాసులగుటకుఁ గారణంబడిగి తెలిసికొనుఁడు.

ప్రభా—(తలవంచి కన్నీరు నించుచున్నది.)

చిత్రి—(ప్రభావతి నవలోకించి) కుమారీ! ప్రభావతీ! ఏమిది! ఆశ్చర్యముగా నున్నది. నీవిట్లేతెంచుట కేమికతము ?

వీర—అమ్మాయీ! కన్నీరునించెదవేల ? పురాకృతప్రారబ్ధకారణంబున నిట్టివి సంప్రాప్తించుచుండును. గుట్టుబయలెక్కినది. ఈ రాజసభయందు నీవు చెప్పకపోయినను సత్యాసత్యములు విచారణమీఁదఁ దెలియకమానవు. కావున చింతింపక నిజము దెలుపుము.

చిత్రి—(స్వగతము) సిందుసభయం దెట్టిది వినవచ్చునో. ఏమినగుబాట్లు రానున్నవో ఇదియంతయు వీక్షింపగా నాకుఁ జిత్రముగఁ గన్పట్టుచున్నది. (ప్రకాశముగా) ప్రభావతీ! నీసోదరుని పలుకులకుఁ బత్యుత్తరంబిమ్ము.

ప్రభా—తండ్రీ! చెప్పుటకేమున్నది. ఇదినాకర్మవాత్రత యిట్లె చ్చటి కీడ్చుకొనివచ్చినది. ఇంతకంటె నేనేమియుఁ జెప్పలేను, (తనలో) అయ్యో! నాకింక నేమి తెరవు. ఇప్పుడెవ్వరిఁ జేరుదు. అక్కటా! ఈరహస్యము నాసోదరునకే తెలియవలెనా; తెలిసెబో యతఁడూరకుండక మమ్ముగారాగృహంబునఁబడ వేయనేల? ఇప్పుడీరహస్యమునిండుకొలువున బయలుపడక మానదుకదా. చేతులారా దెచ్చిపెట్టుకొంటిని.

వీర—ఓరీ! మేదరీ! రాజభటులు నిన్ను జెరసాలయం దేల త్రోసిరి?

వెంక—మారాజా! నాకత్రింతోషం. నోనేపాపమెరుంగను ఒట్టిపున్నాన్ని నన్ను రాచలెంకలుకట్టుకొని పోయిబందెలో యేసినారుబాబు.

వీర—పాపము! ఏమియు నెఱుంగని నిన్నన్యాయముగాఁ బడవేసిరిగా! (జయపాలుని దిలకించి) తపోధనునిబోలియున్న నీకుఁగూడఁ గారాగృహవాత్రయే పట్టినదా.

జయపా—రాజనందనా! దేవరవారి సోదరియగు నీప్రభావతి సౌధం బర్ధరాత్రింబునఁజొచ్చి యీమెభర్తనువధించినందులకునన్నుఁ గారాగృహాబద్ధుని గావించిరి.

వీర—నీవు నిజముగా జయంతుని వధించితివా లేదా?

జయపా—ఆసంగతి నాకును భగవంతునకుఁ దెలియును. ఆతని వధించితినను నేరము మాత్రము నాపై మోపబడెను.

వీర—ఆవధయందలి సత్యమును నీవు వెల్లడిపఱచెదవా?

జయ—దేవా! మీరెట్టిదండన విధించినను సంతసమున సన్మతించి యనుభవించెదనుగాని యీనీచమగు నోటితో నందలిసత్యమును మాత్రము నాయంతట నేను వెల్లడింపఁజాల. మహారాజకుమారా! నన్ను మన్నింపుము.

వీర—(మేదరిని విలోకించి) ఓరీ! నీవింక నసత్యము పలుకక

యథార్థమంతయు నెఱిగింపుము. అట్లెఱింగింపవేని నీవు మరణదండన కుఁ బాలుగావలసి యుందువు.

వెంక—(తనలో) అయ్యబాబో! ఇపుడు నిజమాడకతప్పదు. నాపాణంమీాదికొచ్చేసింది. ఏలరాకపోతుంది. ఎక్కడో అంతప్పురాల్లో నిరాచోరి పిల్లేల ఎనుళ్ళుచీరి మూసివాయిఁకం సేటలల్లుకొని పొట్టోసుకొను తాగుబోతు మేదరిముండాకొడుకును నేనేడసరచాలేడ! హాయ్యో ఆపాడుకోరికనాకేలపుట్టాల: అన్నా నాబుద్ధియెంతగడ్డితిందో! అచ్చంగా పాలవంటి రాచకులానికి పందిపాలుకలిపేసానుగందా! యీాలాట్టిబుద్ధిలేనిపని చేసికనాపాణం మీాదికేలరాదు యేంసేయను సరే యేంసేయను యీావీరసేనరాచాయనకు అంతానిజం తెలిసింది నేదాచేనదాగదు యికేంపయోజనంలేదునామూలాననయీారాచోరిపిల్లపాణాలుకూడాపోతాయిరాబాబు ఏంసేయను (పరికాశము)మారాజారచ్చించండి బాబూరచ్చించండి యింకమీాకాడ అబద్ధంసెప్పను ఆమీాదదేవరోరికటాచ్చం నాపున్నెం నన్ను మీారేలాసిచ్చించినాసరే నేసిద్ధంగావుండాను యీాపెబావతిగారికి నాకును రెండేళ్ళనుంచి చేరికలున్నాయిబాబు.

చిత్రి—(స్వగతము) ఇట్టికర్ణకఠోరమగువార్త వినినంతనె నాహృదయంబు బగులకున్నదికదా. ఆ విధాత నాహృదయంబుపాషాణంబుతో నిర్మించియుండనోపు. ఉత్తమక్షత్రియవంశ సంజాతయగునాపుత్రికకును, నీచకులుండగు నీమేదరికిని రెండువత్సరములనుండి మైత్రికలదట ఛీ! ఎంతమాట వింటిని. "యాదవకులంబున ముసలముబుట్టెన" దన్నట్లు, మారాచవంశమున కులటయగు నాకుమారి జన్మించెను. ఇప్పుడు నేనేమని విచారింతు.

తే. గీ. పందువంటి కులంబెల్ల భస్మమయ్యె
సంభవంబయ్యె గడుదుర్యశంబు; నవ్వ

నయ్యో భూనాథులెల్లరు । నకట; కులట
యాకుమారిక జన్మంబు । నందుకతన.

(11) సాంగు—చిత్రసేనుడు అఠాణా-రూపకము.

1 ఎంతఘోరకార్యము । హాంతకారిపుత్రిచేసె॥ నెంత॥ నీచుని
మే దరిగలయుచు । కాంతుగొంతుగోసెపుత్రి॥ ఎంత॥

2 పాలబోలురాచకులము । పాడుచేసెతుచ్ఛనెనసి । ఏలీలనుసహి
యించెద । యిట్టిపాపకార్యమువిని॥ ఎంత॥

3 ఏమిసేతునెందుజొత్తు । నిట్టిదుశ్చరిత్రిగాంచి। యీమహి తలయె
త్తి బ్రతుక । నెంతయుసహియింపగలనె॥ ఎంత॥

అక్కటా! ఇంకనలువురిలోఁ దలయెత్తి మెలఁగనేతునా ?

వీర—(రాజును విలోకించి) తండ్రీ! విచారించుచుంటిరేల ?

చిత్ర—కుమారా ! ఏమున్నది. ఎన్నఁడును దలఁపయుండని యపకీర్తివచ్చినందుకుఁ జింతిల్లుచున్నాఁడ.

వీర—రాజేంద్రా! చింతపడినందువలన లాభంబు లేదు. ఇంక మనము ముందు వినబోవుసంగతులు హృదయవిచ్ఛేదకంబులై యెప్పుచుండును. కావున ధైర్యమునుబూని చిత్తగింపుడు. (మేదరిం జూచి) ఓసీ ! తరువాతసంగతిం జెప్పుము.

మేద—బాబూ! యీమెనాగుడిసికాడికి పతీదినానానడిరేయివచ్చే అలవాటుండేది మాంరాజా ఆబిడమగడొచ్చిన దినాన రేత్రికూడా నావు కాంకాడికొచ్చేసింది. ఏమియింతజాలం సేసావని అడిగాను సామి నేడు నాభర్తవచ్చెశాడుఆతడున్న మనకూటాలకు బంగం ఒస్తుంది నీకత్తినా చేతికిస్తే నామగడు నిద్దరపోతుండగా సంపేసివస్తాను అనిసెప్పి యీయమ్మోరు నాసేతికత్తిపుచ్చుకొనిపోయింది మాంరాజా అప్పుడు నేనొద్ద నేసెప్పినాను కానినామాట యినకఆల్లా సేసిందియేలికా.

చిత్ర—(స్వగతము) ఆహా! స్త్రీలెంతకైనను జాలుదురు.

తే. గీ. మంచివారికరణిఁగాను పించుచుండు
రెన్నిమాయలో పన్నగా నెంచుచుండు
రమణులను గూడుచుండి శ్రీ రంగనీతు
లెన్నియో పల్కుచుండు మహీనియందు.

స్త్రీచిత్తవృత్తిఁదెలియ నెవ్వరికిని దరంబుకాదుగదా. ఈజారిణి విటకాని స్నేహము శాశ్వతంబనితలంచి భర్తను జంపదలచెనఁట. కటకటా! ఎంతదారుణము. (పుత్రికనుద్దేశించి, హా! పుత్రీ! ప్రభావతీ! ఉభయకులంబులకును గీర్తిదెచ్చి చంద్రమతీ ద్రౌపదీత్యాది కాంతా శిరోమణులు పోయిన తెరువున బోయి కీర్తిగాంచెదవని తలంచితినిగాని యీరీతి దుశ్చారిత్రవై నావంగడంబునకెల్ల నపకీర్తిదెత్తువని దలంప లేను. సద్గుణంబులు లేని పుత్రికలు పుట్టుట కడుపుచేటు గదా. ఇటు వంటి పాపాత్ములు పుట్టిననేమి గిట్టిననేమి?

వీర—(మేదరిని విలోకించి) తరువాత.

వెంక—ఆజాయిసీయమ్మ నాచేతికత్తెట్టికెళ్ళి మంచినిద్దర పోతుండగా మగని మెడనరుకుచుండంగా ఆ, ఆ, ఆగు ఆగు నరకొద్దని కేక వేస్తూ ఒకజోగివాడు అడ్డాంకి పెట్టినాడంట అంతలోకే యీబిడనరికేసిందంట. ఆజాయినడ్డుకొన్న సన్యాసిగాడినిచూపి యీయమ్మభయపడి ఆచేటుపని ఆజోగాడిమీదికి తోసేయాలని రాజభటులార నామగని నెవ్వడో చంపుసుండాడు బేగొచ్చిరచ్చించాల అని కేక లేసిందంట బటులా కేకలిని ఆజోగి యీతని కట్టుకుపోయినారని నిన్న రేయి యీబిడనాతో సెప్పింది అంతేగాని నోనోసంగతి యెరుగను బాబు యీపాపానికి నాకత్తికూడ సాయపడ్డమాట సత్తెం ఆమీద పబువులసిత్తం యీదురుమారుగుని యీతాగుబోతు యెదవను మీరేమిసేసినమ సేయొచ్చు నాపాణాలు మీకిచ్చేసాను మీచిత్తం బాబు

ప్రభా—(తనలో) ఈ మేదరి రహస్యంబంతయుఁ బూసగుచ్చి

నట్లు వచించినాఁడు. ఇంక నేనెంతమాత్రమును మరియొక తీరునఁ జెప్పి తప్పించుకొనుటకు మార్గము లేదు. ఇందుకు నేనొడంబడియే తీరవలయును. అక్కటా! పతులనువంచించి యుపపతులను జేరుటవలనఁగలిగెడు నష్టము నాకిప్పుడు కదా బోధపడినది.

వీర—(ప్రభావతినిజూచి) ప్రభావతీ! ఇందులనుగురించినీవేమి వచించెదవు. ఈతుచ్ఛుఁడు పలికినపలుకు లన్నియు నిజమేనా?

ప్రభా—(తనలో) ఈతనిపల్కుల కేమిప్రత్యుత్తరంబిత్తు? తలయెత్తిమాటాఁడగలనా! జీవంబులుదాల్చి భూమిపైబ్రతుకగలనా! (ఏమియు మాటలాడక యూరకొనియుండను.)

వీర—సోదరీ! నిరుత్తరం బంగీకారసూచకంబేకదా.

చిత్ర—(తనయునింజూచి) కుమారా! నేనింకసభాస్థానంబున నుండఁజాల. ఇందునీయిచ్ఛవచ్చినట్లు విచారించి నేరస్థులను శిక్షింపుము. ఈయధికారము నీకొసంగితి. (నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రభా—సోదరా! నీవింకనన్ను గ్రుచ్చిగ్రుచ్చి యడుగనేల. సమస్తంబునునీకుఁ దెలిసియేయున్నది. పూర్వజన్మపాపంబునం జేసి నేనిట్టి కార్యంబునకుఁ దొడంగి నిందపాలయితిని. దోషంబంతయు నాయదెకాని మేదరి దెంతమాత్రమును లేదు. ఇట్టి యకార్యంబాచరించి కులంబునకెల్ల నపకీర్తి దెచ్చితి. ఇంక నేనీజీవంబుల భరించి ధరాతలంబునఁ దలయెత్తి మెలంగజాల. కావున నాయందుఁ బరిపూర్ణకృపాంతరంగుడవై నీకరవాలంబుచే నాకంఠంబునఱికి పుణ్యముగట్టుకొమ్ము.

వీర—ప్రభావతీ! నీవుభర్తనుమోసగించి యుపపతిగూడినందులకు నీకంతశిక్ష విధించునంతటి యవసరముండదు కాని భర్తప్రాణంబులు తీసినందులకు మాత్రము నీప్రాణంబులు దీసితీరవలయును. నీయందుగలిగిన వాత్సల్యమును, కూర్మి, ప్రేమయుఁద్యజించి నీకిట్టిశిక్ష విధించుచున్నాఁడ. నీతల్లినిజూడఁ గోరికకలదేని యొకసారిజూచి నిప్రాణంబులు బాయుటకు సంసిద్ధవై యుండుము.

ప్రభా—సోదరా! ఇట్టియకార్యం బాచరించి నిందపాలయిన నేను నాజనని మొగం బేరీతి జూడగలుగుదు? అయినను నవమాసంబులు మోచినన్నుఁగని నానాకష్టంబులఁ బొంది పెంచిపెద్దదానిగఁజేసిన యామె నొకసారి దర్శించివచ్చెద ననుగ్రహింపుము.

వీర—(మేదరినిజూచి) ఓరీ ! జయంతవధనుగూర్చి ప్రభావతిని బ్రోత్సాహపఱచినదినీవేయని మాకుఁదోచినది. కాని దోషంబుమాత్రము విశేషముగాప్రభావతియందున్నది. కావున నామెకు మరణశిక్షయు, నీకు నిజీవంబులున్నంతవఱకును గారాగారనివాసివైయుండునటుల నుశిక్ష విధించితిని. (రాజభటులంజూచి) రాజభటులారా ! ఈప్రభావతిం దోడ్కొనిమాజనినిని దర్శింపఁజేసి పిమ్మట కింకరుల కప్పగించి యురితీయింపుడు. ఈమేదరిని గారాగృహనివాసునిగాఁ జేయుఁడు. ఇదే ముమ్మాటికి నాజ్ఞ.

(12) సాంగు—వెంకడు కాంభోజి-ఏకతాళము.

1 సంపుడయ్యానన్ను కూడబాబు । నాకొంపదీసిబందెలోన। కుళ్ళబెట్టిబోకుడయ్యా॥ సంపుడయ్యా॥

2 ఎల్లకాలమిట్టులుండజాల । మీపిల్లనాకుకొంపదీసెచాల । పిల్లలాకుదిక్కులేదు । యిల్లాలికూతలేదు । యెలాబ్రతుకువాడ । యేలీకష్టోప్రుడయ్యా॥ సంపుడయ్యా॥

3 బుద్ధిలేకపాడుపనిచేసితీ । వేసుగ్దులేలమిమ్ముదుఃఖపెట్టితీ। హద్దుమీరియున్ననన్ను । గుద్దిసంపియేయరయ్యా । మొద్దులాటిబ్రతుకదేల। భూమిపాలసూడకయ్యా॥ సంపుడ॥

వెంక—(తనలో) ఓరిబాబు పుట్టిమునిగింది యీపాడుకట్టెలో పాణాలున్నంతకాలం చెరలోయేడవాలంట అయోదేముడా అంతకంటె సావేమేలుగందా (ప్రకాశము) మారాజా: కటాచ్చించి నాతలతీయించే యేలనేనిసిచ్చపొందలేనుబాబు మీవంటిపబువులు యింతత

క్కువుసిచ్చుయేస్తారా బాబూ సిచ్చు మెచ్చించాల అన్నా నాకూయి మీాశేలయింటారు నేచేసిన పాపం అనుభవించొద్దా అయ్యో పెబావతీయెంత పనిచేసితివమ్మ కోతివంటినీచిత్తం సిక్కపెట్టలేక తాగుమోతులంజకొడుకును నన్ని గందంలోకి దింపి నాకొంపతీసావు నీపాణాలు తీసుకుంటున్నావు అయితేయేం లే నాకంటనీవేమేలు యేమంటా వానీకురుసిచ్చుయేసారు గనుక కట్టాలు తెలవు నోనంతేను పాణాలున్నంకాలం గబ్బిలప్పెంటవాసనతోనున్న బందిలో చచ్చినట్టుపడుండాల యిదంత కేంగాని ముందునాకొంపతీసుకొన్నాను ఓసీ యీాదిపిల్లా! సేటితో నీకూ నాకూ సరి నీమొగం నాకు కనబడకుందా ఆనాడునీ వెన్ని సెప్పావు మాావాళ్ళు ఒద్దుసుమీాఒద్దుసుమీా రానారిపిల్లస్నేహం ఒద్దుసుమీాయని నాకెంతగ డెట్టాలే నీమాటయినక యెదవనై కుక్కనై గాడిదనై పందినై పాల వంటిరాచకులం చెరిచి నాకొంప తీసుకొన్నాను. నేనేకాదు నావలెమంచిచెడ్డలాలోచించక పోరుగోరి సంసారిపిల్లల కూడినయెదవల అందరిగతియింతే. యిక్కడరాచసిచ్చ చచ్చినవాకు యముడుసిచ్చేతప్పదు కలిసొచ్చిందికందా అనివొళ్ళెరక్క పాడుపని సేయగా నేసరా! యిప్పుడు నాకొంపకూలిపోయింది నాకత్తిమూలపడింది నాపిల్లలు చిన్నోళ్ళుపనిపాటలు సేయలేరు నాయాలిసత్తిలేనిది తడికలల్లు నేర్పులేదు. ఆళ్ళెట్టుజీవిత్తారో తెలదుగందా ఓలేవ్రుయీాసిపిల్ల తిరిపమెత్తై నాపిల్లలను రచ్చించుకొనుము. కాని యీాపెబావతిలాగ పాడుపనికిసిద్దం కాకుము. ఓరోరీపోకిరీలంజకొడకలార నాలాగులాతితెరవలబరిగి యిపత్తులపాలు కాకుడు ఓతల్లులార! నాలాటినీచోన్నికూడి కామంచేతకన్నులు మూసుగోనిపోయిలంజలైతిరిగి యీాపబావతిలాగ కాకమీామానం కాపాడుకోండి. దేవుడా యిక నాబారం నీమీాదేసాను ఆపైనిసిచిత్తం.

(భటులు సంకెలలు దగిలించి తీసికొనిపోవుచున్నారు.)

(13) సాంగు—పరిభావతి హామానాఘానాలనువరుస

1 హా । పాపీ । నైతీ । నాపతీజంపీ॥ హావాపీ॥ జారిణినైదు । శ్చారిణినైనం । సారముగూరిచి జేరము ఘోసితి ॥ హా ॥

2 లాలితరాజకులంబు చెరిపితినయ్యో । యేల । నాబత్రితు । కేలనాదుజన్మ॥ హాపాపి॥

3 జగతిపతివ్రతా । చరణముతోసాటి । లేనుకదాయెంచలేటులకీ యెడ॥ హాపాపీ॥

పరిభా—(స్వగతము) పతిభక్తికిమించినవస్తువీజగంబున లేదను సంగతి నామనంబున నిప్పుడునాటినది. ఏదియైనను ననుభవంబులోనికి వచ్చినగాని తెలియదు. తుచ్ఛసుఖంబునకాసించి మహాదుష్కార్యం బాచరించితి. ఈనామరణంబు లోకంబున సుదతులెవ్వరునునిట్టియకార్యము సేయకుండుటకై యుదాహరణమై యలరుఁగాక. ఆహా! ఎంత పాపంబుగట్టుకొంటి. భర్తనువధించిలోకనిందపాలైతి. జననీజనకులారా మీరునన్ను పెంచినందుకు సద్గుణంబులుకలదానినై వంశమునకుఁగీర్తి తేజాలనైతిని. నాపూలంబునమీకుఁగూడ నపకర్తివచ్చినది. నేనెటువంటిదాననైనను మీయందనురాగముమాత్రము లేకపోలేదు. నేఁటిదినంబుననే ప్రాణంబుల బాసిపోవుచుంటిని, ఇట్టికుమారికగలిగెననియు నామెకుమరణదండన విధింపబడుటచేఁ జచ్చెననియుమాత్రము మనంబున నుంచుకొనుడు. కాంతామణులారా! పురాకృతపాపముననంజేసి నేనిట్టితుచ్ఛమగు దుష్కార్యం బాచరించి యిట్టిపాపంబు గట్టుకొంటి. మీరెల్లరును విద్యావతులై భర్తసేవయే మోక్షప్రదంబనితలంచుచు దుర్గుణంబులను దరిజేరనీయక పుట్టినింటికి మెట్టినింటికిని యశంబుగూర్పుడు. నేను పతివ్రతనుగాకపోయినను నాయనుభవంబునజేసి యిట్టియుపదేశంబిచ్చుచుంటి. భర్తసేవ విడనాడి జారిణినై సంచరించినందుకు ఫలం బనుభవించితిని.

వీర — రాజభటులారా! ఈమెను మాజననికడకుఁ గొనిపోయి యామెదర్శనంబు జేయించి మధ్యాహ్నంబున వధ్యభూమికిం గొనిపోయి యురిదీయుఁడు.

(రాజభటులు పరిభావతిని దోడ్కొనిపోవుచున్నారు.)

జయవర్మ — రాజకుమారా! కాలాతీతమైనది మనముగృహంబునకుఁబోదమా.

వీర — మంత్రివర్యా! నీవేగుము. నేనీసన్యాసిశోధించుక సంభాషించివచ్చెద.

(జయవర్మ నిష్క్రమించుచున్నాడు.)

వీర — సన్యాసి వేషధరా! నీరూపంబుజూడ నీవొకసుక్షత్రియ వంశజుండవని తోఁచుచుండెనని నేనిదివఱకే నీతోఁ ననియుంటిని. ఇప్పుడైననుమనంబున శంకదక్కి నిజంబు వచింపఁగోరుచున్నాఁడ.

జయపా — రాజకుమారా! ఆసంగతియంతయు నేనువచింపరాదు. అందులకునన్ను క్షమింపుము. కొండొకకార్యార్థమై యీసన్యాసి వేషంబుధరించితిని. పూర్వజన్మంబున నెద్ది యొనర్చినపాపంబు జేసికొనుటంజేసి కారాగృహమునందు యోగము సంభవించినది. నీకృపవలన బంధవిముక్తుఁడనైతిని. ఇంక నాకనుజ్ఞయిచ్చితివేని నేనేఁగెద.

వీర — ఓయీ! హితుడా! లోకంబున న్యాయాన్యాయంబులు గనిపెట్టుట మిగులకష్టముసుమా. ఏమియు నెఱుంగని నీకన్యాయముగఁ గారాగృహవాసంబు తటస్థించెనుగదా. అందులకు నీచిత్తంబెంత పరితాపమొందుచున్నదో.

జయపా — అందులకే నెంతమాత్రముజింతించుటలేదు. నాబ్రతుకుమాత్రము చింతలకాకరంబైయున్నది.

వీర — ఏమి; అట్లంటివి?

**జయపా — మరేమియు లేదు.**

వీర—పోనిమ్ము. దానికేమిగాని నీనిజవర్తమానంబు దెలిపి నన్ను సంతసపెట్టెదవా?

జయపా—అయ్యా! అదిమాత్రము చెప్పనందుకు నన్ను క్షమింపుము.

వీర—నీవట్లనుచుండఁగా నేనేమి చెప్పఁగలను? నీకెద్దియేనియభీష్టంబుగలదేని జెప్పుము. దానిఁదీర్చెద.

జయపా—(స్వగతము) ప్రాణపదంబయినమిత్రుండు గతించినాఁడు. ఇంక నాకేమి కావలయును? అతని యస్తి కలనైనజూచి సంతసించుచుందును. కావున నవి యిప్పింపుమని కోరుదు. (ప్రకాశముగా) రాజనంధనా! నాకేమియునభీష్టంబు లేదు. కానిజయంతుని యస్థికలు మాత్రము నాకిప్పింపుము. నాకదియే పదివేలు.

వీర—ఇదియేకదా నీయభీష్టము. అట్లనే యిప్పించెద. ఇఁక నే బోయివచ్చెద. (నిష్క్రమించుచున్నాఁడు.)

జయపా—(తనలో) లోకంబునఁగల యంగనలందఱునుపతివ్రతివలెనే చరించుచుందురా! మూడువత్సరములనుండి పుట్టినింటకడనే యున్న నాభార్యయు నిట్లుపవర్తించుచుండెనుగాఁబోలు. జయంతుని యస్తికలంగొని నాయత్తవారింటికేఁగి నాభార్యాగుణంబులఁ బరీక్షించెదఁగాక.

(నిష్క్రమించుచున్నాడు.)

ఇది తృతీయాంకము.





# సంగీత జయంత జయపాలము.

చతుర్థాంకము.

కల్యాణపురము.

చా రు మ తి సౌ ధ ము.

[ప్రవేశము:—చారుమతియు, నర్మదయు]

చారు—చెలీ ! నాకంటె నీవు వయస్సునఁ జిన్నదానవయ్యును, భర్తృసేవాపరాయణురాలనగుటం జేసి పతివ్రతాధర్మంబుల నుగ్గడింపు మనికోరితివి. అందుకు నాడెందం బెంతయు నానందం బాదినది: నాకుఁ దెలిసినంతవఱకుఁ దెల్పెదను. సావధానచిత్తవై యాలింపుము.

(14) పాంగు —చారుమతి కాంభోజి—ఆది

1 పతిభక్తిసాటిలేదుగా । ఓపణతీవసుధాపైని । పరిశీలింపగ॥ పతిభక్తిసాటి॥

నిరతంబుపతిసేవ । జరియించుసతులాకు । ధరణీదుస్తరగాత్యతతియున్నదే॥ పతిభక్తి॥

2 సత్యాముగాసూర్య చంద్రులుదయింపాక । వ్యత్యస్తమూచేయు బల్మిచేకూరు॥ పతిభక్తిసా॥

3 ఒక్కపతివ్రాత । యుర్వీతలంబెల్ల । జక్కాడచుబ్రోచుశక్తిజెలగు॥ పతిభక్తి॥

తే. గీ. కుష్ఠురుఁడైన జారుండైనఁ గూళయైన
విటుఁడయైనను మరి యవివేకియైన
దరుణి కాత్మనాథుఁడు సుమీ దైవసముడు
వానిసేవయె తలఁప సౌభాగ్యమతివ.

పతి యెట్టిదుర్మార్గుఁడైనను నాతనిని దైవంబువలె భజించెడి కాంతనే పతివ్రతారత్నంబని యందురు.

సీ. సకలసౌభాగ్యకా ఽ సారంబునకు రాజ
హంస తలంపఁగా ఽ నాత్మధవుఁడు
అంచితానంత సౌ ఽ ఖ్యాంబుధి నోలలాడఁ
బతికదా పూర్ణత ఽ పాకరుండు
సంతాపదావాగ్ని ఽ శాంతింప నిజభర్త
యేకదా ఘనవృష్టి ఽ జోకవాఁడు
సంసారమను మహా ఽ సాగరమ్మునఁ దేల్చు
నౌకకు వరుఁడెకా ఽ నావికుండు

తే. గీ. సకలమంగళములు గూర్పఁ ఽ జాలువాఁడు
దలఁపగా ప్రాణనాథుఁడే ఽ తరుణికెప్డు
డింతవచియింపగా నేటి ఽ కెంచిచూడఁ
దోయజాక్షికి భర్తయే ఽ తోడునీడ.

సీ. దరిలేనిదుఃఖాబ్ధి ఽ దరియింపఁజేయఁగా
భర్తసేవకద చూ ఽ పట్టునావ
స్వర్గపురాంతర ఽ సౌధరాజము నెక్క
రమణుసేవయెకదా ఽ రాచబాట
సహధర్మచారిణీ ఽ సద్వ్రతమ్మునకెప్డు
నాత్మనాథునిసేవ ఽ యాలవాల
మతిపాపసముదయా ఽ రణ్యము జెక్కంగఁ
గోమలాంగునిసేవ ఽ కులిశధార

తే. గీ. సకలకార్యనిర్వాహక ఽ సాధనంబు
ప్రాణకాంతుని నిజపాద ఽ పద్మసేవ

యుఁ జిత్తానందమును గూర్చు ॥ నతివ కెపుడు
ప్రాణకాంతుని నిజపాద ॥ పద్మసేవ.

పతిమనం బెట్లుండునో యదికనుఁగొని యాప్రకారము వర్తించుచు హరిగాథ లాలించుచు, నతిథులను బూజించుచుఁ గాలంబుగడిపెడి కాంత పతివ్రతయనంబరఁగు. మఱియు సద్గుణంబులు గల వధూటి

తే. గీ. ఉన్నదానికి సంతృప్తి ॥ నొందుచుండు
నెల్లపూజలు సేయుచు ॥ నెగడుచుండు
నఖిల సాధ్వీజనైక హృ ॥ ద్ధ్యానవద్య
సుగుణగణనీయ యగుచుండు ॥ జగతియందు.

తే. గీ. అత్తమామలయందున ॥ బత్తిగలిగి
మఱఁదలయెడ సతతమున ॥ త్కారుణఁబూని
భృత్యజనముల నెపుడు కో ॥ పింపఁబోఁక
ఉభయకులములకు సుకీర్తి ॥ యువిద తెచ్చు.

పరపురుషులు సోదరులుగను, పరులధనంబు దృణంబుగను, బరికించుచుండును. ప్రాణధవుని పదసేవాపరాయణురాలు ప్రాణహానియైనను నోర్చుఁగాని మానహాని కోర్వదు. పతిసేవ జేయఁదలంపని నాతి కోతిగాని నాతిగాదు. ఒకత్రుటికాలంబైనను పతినెడబాయక యతఁడెన్ని యిడుమలఁ బడుచున్న నవియెల్లఁ దానును బడుచు యశంబునందవలయును. పతివ్రత భర్తకన్న ముందుగా నిద్రలేచి యతనిపాదంబులకు నమస్కరించి, యత్తమామల చిత్తంబు ననుసరించి, గృహకృత్యంబుల నెల్లదీర్చి స్నానం బాచరించి, చక్కని చేలంబు ధరించి వంటకంబొనర్చి యతిథులం బూజించును.

నర్మ—సఖీ! చారుమతీ! పతి పరదేశవాసుఁడైయుండెనేని సతి యేమి సేయవలయును?

చారు—(స్వగతము) ఆహా! ఈమె చక్కనిప్రశ్న యడిగినది. ఇందుకేమి ప్రత్యుత్తరంబిత్తు ఈప్రశ్న నాహృదయంబు తయుఁగలంచినది. చిరకాలంబునుండి నిజపాదాంబుజదర్శనంబీయని నానాథునిజ్ఞప్తికిదెచ్చుచున్నది. (ప్రకాశముగా)నర్మదా! సాధ్వమయినంతవఱకుభార్యయెప్పుడునుభర్త నెడబాసియుండరాదు. అట్టిది తటస్థించెనేని పతివ్రతయగుకాంత యెప్పుడును బుప్పొలుముడవక, తాంబూలచర్వణమాచరింపక పతిరాక కెదురుజూచుచు దినంబులు గడపుచుండును.

నర్మ—ప్రియసఖీ! నేఁను నీమూలంబున నీపతివ్రతాధర్మంబుల గనుఁగొంటి. నాచిత్తంబునకెంతయు నానందముగూర్చితివి. ఇంకనొకటియడుగఁ దలంచితిని. పతివ్రతయగుకాంత కెప్పుడును స్వబలంబుకంటెదైవబలంబెక్కుడుగనుండునని జనులువచింపుచుందురు. ఇదినిజమేనా?

చారు—అందులకు సందియమేమి? ద్రౌపదీచరిత్రమాలింపలేదా. మున్ను కౌరవులామెను నిండుసభయందు వస్త్రములొల్చుచుండఁగా నామెశ్రీకృష్ణుని బ్రార్థింప నతండు కృపాంతరంగుండై రక్షించెను గదా.

నర్మ—నీవుచెప్పినమాట నిజంబే.

చారు—భర్తనువిడనాడి కాలంబు గడపుసతిబ్రతుకుబ్రతు కే కాదు. రమణీ! నాయవస్థకు నేనేమని చింతింతు.నాభర్తసందర్శనమాచరించి నేటికిమూడువత్సరములైనది. అక్కటా! భర్తనుజూడక నేనెన్నిదినంబులిట్లు కాలంబుగడపఁగలను? భర్తయేకదా భార్యకుదోడునీడయైయుండును. అట్టిపతి నన్నుఁజూడక యిన్నివత్సరంబు లున్నయప్పుడు నేను జీవించుటవలన ఫలంబేమి? చెలీ! నిజము జెప్పుచుంటిని. ఇంక కొలదిదినములలో నాభర్త నన్నుఁజూడరాక యున్నచోఁ బ్రాణంబులు బాయుటకు సంసిద్ధనైయుంటి ఇట్టి బ్రతుకుకంటె జీవంబులఁబాయుటయే మంచిదని నాచిత్తంబునఁదోచినది.

నర్మ——చెలీ! కాలంబెప్పుడును నొక్క రీతిగనుండదు. చీకటు లువోయి వెన్నెలలు వచ్చురీతి దుఃఖములుఁ బోసి సౌఖ్యంబులందు దినం బులువచ్చును. కావున మనంబునఁ జింతపడియుండకుము. నీతో వెనుక నొకయోగిని నీభర్తను కొలఁదిదినంబులలోనె చూడగలవనివక్కాణిం చియున్నది. మహాత్ముల వాక్యంబు లనృతంబులుకావు. నీవు నీభర్తను ద్వరలోనె చూడగలవు. 7/16

చారు——సఖీ! యెక్కడిమాటలు. ఆయోగిని చెప్పి యనేకదినం బులాయెను. ఇంతవరకును బ్రాణేశ్వరుని జూడనేలేదు. భగవంతుఁడు నానొసట నిట్లువ్రాసియుండఁగా వేరువిధంబున నేలజరుగును.

నర్మ——చెలియా! చింతింపకుము. భగవంతుఁడునీయెడద్వరలో నే కృపఁజూపనున్నాడు. (ఇంచుకయూరకుండి) చాలప్రొద్దుపోయినది ఇంక నేగృహంబున కేఁగెద.

చారు——అట్లనేపోయిరమ్ము.

(నర్మద నిష్క్రమించుచున్నది.)

చారు——(స్వగతము) అక్కటా! నాయవస్థకు నేనేమనిచింతిం తు. తోడికాంతలెల్లరును దమభర్తలంగలసిసౌఖ్యంబందుచుండ నేనిట్టి దుఃఖంబుననుభవించుచుంటి. వారిమధ్యంబునఁ గూర్చుండుటకే నాకు సిగ్గగుచున్నది. అయ్యో! భగవంతుఁడు నాబ్రతుకిట్టిదిగాఁ జేసెను. ఇ ట్లగునని కలనైనం దలంపనైతిని. భర్తసేవలాచరింపుచు దోడికాంత లెల్లఁ బొగడునట్లు యశంబునందుదునని దలంచితినిగాని యిట్లగునని యెన్నఁడును దలంపనైతి. ఇబ్బంగి నింకెంత కాలముగడపుదు ?

తే. గీ. దీపతతిగాననాని మందిరముభాతి
శారికారాజులేని పంజరముమాడ్కి
భవ్యదైవంబు లేని గ్రామంబుపగిది
కాదెభర్తచెంగటలేని కాంతబ్రతుకు.

నన్ను జూచిన కాంతలెల్లరు బరిహాసింపుచుందురు. (ఇంచుక యూరకుండి) హా! మనోహరా! నావలన నేరంబేమి? నన్ను విడనాడి యీరీతి నిన్నివత్సరంబు లుండన్యాయమా? అగ్నిసాక్షిగవివాహంబైన నాయెడ నింతనిర్దయవహించుటకునావలనదోషంబేమి? నిరంతరమును నీనామమే దైవమంత్రమువలె హృత్పీఠికయందుంచి భజించుచున్న నా యందిప్పుడైనను కృపవహింపవా? ఇన్నివత్సరములు విడనాడియుండి నచో నాబ్రతుకేమగునోయని నీకుందోచలేదా? అహర్నిశంబులునీపాదసేవనొసంగి నన్ను ధన్యగాం జేయుదువనియాసతోనుంటినిగానియీరీతి జేయుదువని యెన్నండునుదలంపనైతిని. నీయండలేనట్టినాబ్రతుకేల? కాంతలకెప్పుడును బతిసేవయే కదా సకలసౌభాగ్యసంపత్ప్రదంబు. భార్యను హింసపెట్టుటనీబోటి పుణ్యాత్ములకుందగునా (ఇంచుక యూరకుండి) హా! దైవమా! నేనీకింత బరువైతినా. నిరంతరమునినామస్మరణం బాచరించుచున్న నన్ను కరుణతోం జూడకుండుట పాడియా. నా మనోహరసందర్శన మాచరించునట్లునీవుచేయలేవా? నాయందిట్టి నిర్దయవహించుటకు నేను నీకేమి ద్రోహంబు గావించితిని తండ్రీ! గోపాల కృష్ణా! నీవేదిక్కని మొరపెట్టుకొన్న దీనజనంబులననేకులరక్షించితివి నామొరాలింప వేమి కారణము?

సీ. కోపమా లేక నా । పాపమా నన్ను సం
తాప పెట్టంగనో । దైవరాయ
ఖేదమా నీకేను । వాదమా నాతోడ
ఖేదమున్ గూర్పంగ । సాధువంద్య
వాసియా నీకిది । దోసమా నాయది
యాసున జూడంగ । భాసురాంగ
నేరమా నావల్ల । భారమా నేనువి
చారముఁ గూర్పంగ । సదయహృదయ

తే. గీ. యింతవంతను గూర్పంగ ॥ స్వాంతమందు
దలఁపుఁ బూనుట గడుమంచి ॥ దా తలంప
బోవి వే యిపుడైన సం ॥ పూర్ణకృపను
పరమ కరుణాస్వభావ గో ॥ పాలదేవ.

అయ్యో! నాసంతాపంబు లేనిన్ను వేడికొనుటలయ్యెకాని నీకు గృపలేనప్పుడెట్లు నాయందుదయబూనుదువు. అదియుంగాక బ్రహ్మ నానొసట నిట్లు వ్రాసినాఁడు. అది యనుభవింపక నాకుఁదప్పునా! దానినిదప్పించుట కెవ్వరికైనను దరంబగునా! (ఇంచుక యూరకుండి) వెనుక నొకయోగిని నాకడకు వచ్చి చింతించుచున్న నన్నుఁ గాంచి "రమణీ! నీవు నీభర్త రాకకై యెదురుచూచుచు జింతించుచుంటివి. నీమనంబుననున్న కోరిక దివ్యదృష్టిని నేగనుగొంటి. నీభర్తసందర్శనంబు త్వరలోనే చేయఁగలవు! నీకుశుభంబు లొనఁగూడు "నని వచించెను. ఆహా! ఆయోగిని పల్కులుకూడ మిథ్యయయ్యెను గదా! ఆమె వచించి యిప్పటికి వత్సరంబైనది. ఇంతవఱకును నాతని జూడనే లేదు. నేనింక నెన్నాళ్ళుండఁ గలను. (ఇష్టదైవతమగు కాళీదేవి నుద్దేశించి) తల్లీ! దుర్గామహాదేవీ! నిన్ను నాయిలువేల్పుగాఁ బూజించుచుంటిని. నాయందు నీవు కరుణవహింపవైతివిగదా. ఓతల్లీ! భగవతీ! వేయేటికి. నీవు నాయందుఁగరుణబూని నన్ను నాభర్త సందర్శనమాచరించునట్లు చేయకపోతివేని నేను బ్రాణంబులు బాయుట నిజంబు. ఇదే ముమ్మాటికిని బ్రతిజ్ఞచేయుచున్నాను.

[అంత నేపథ్యమున]

భక్తురాలా! చారుమతీ! నీభర్త యిచ్చటికింక మూఁడుదినంబులలో నరుదెంచును. నామాటనమ్ముము. నీభక్తికిసంతసించితిని. నీకుడిహస్తంబుతో విగతజీవులను స్పృశించితివేనిసజీవులగుదురు. ఈవరంబు నీకొసంగితిని. మనంబునఁ జింతదక్కియుండుము.

చారు—ఆహా! ఏమినాభాగ్యము. భగవతి నాయందుఁ బ్రసన్నయైనది. నాకు వరంబుగూడ నొసంగెను. నేఁడుకదా నాకానంద మబ్బినది. ఇంక నేనుజింతవీడి మనోహరపాదసందర్శనంబున కెదురు చూచుచుందు.

(నిష్క్రమించుచున్నది.)

ఇది చతుర్థాంకము









# సంగీత జయంత జయపాలము.

## పంచమాంకము.

---

### చారుమతి సౌధము.

[చారుమతీ—జయపాలుడు ప్రవేశము.]

(15) సాంగు—చారుమతి కేదార రాగము-రూపకము.

1 ధన్యురాలనైతినిమీసు । ..ర్శనమున ప్రాణనాథ । మాన్యచరిత నినుగంటిని । మానితనైతి॥ ధన్యురాల॥

2 ఆయుమా టాత్మవిభవ । మందితిసుఖముల జెందితి । మాయురే మిముకనుంగంటి । మహిని వెలసితి॥ ధన్యు॥

3 చిరతప బుచేసియుంటి । వరదర్శనమునుగంటిని । సిరులగంటిసౌభాగ్యము । జెందియుంటిని ॥ ధన్యురా॥

చారు—సీ. ఇదికదా సుదినంబు । తుదిలేనినాచిత్త
సంతాపమెల్లను । సమసిపోయె
నిదికదా సుదినంబు । మదిరాత్మలందున
వెలలేనికీర్తితో । మెలఁగగంటి
నిదికదా సుదినంబు । మదనారిపాదముల్
భజియించినందుకు । ఫలముగంటి
నిదికదా సుదినంబు । మదనసుందరమూర్తి
వౌనినుగాంచు భాగ్యంబుగంటి

తే. గీ. నేము చెప్పెదు నాభాగ్య మిపుడు నీకు
వేచియున్నందులకు నిన్నుఁ జూచినాను
ధన్యనైతిని నీపాద దర్శనమునఁ
గలరె ననుబోలు పుణ్యులు క్ష్మాతలమున.

మనోహరా! భవదీయముఖారవిందసందర్శనంబునం జేసి నాకెంతయో యానందము గలిగినది. మీపాదదర్శనం బాచరించి నేటికిమూడువత్సరంబు లైనది. పుట్టినింటికడ కాంతనిన్నాళ్ళుంచుటకు మీమనం బెట్లుసమ్మతించె. మిమ్ము విడనాడిన నాటినుండియు దిన మొక యుగము గాఁ గడపుచు మిమ్ముల నెప్పుడుచూతునాయని వేచియుంటిని. నన్నీరీతి విడనాడి యుండుట మీకు న్యాయమనితోఁచెనా. సద్గుణంబులు గల పడఁతికిఁ బతిపదాంబుజసేవకంటెనితరంబు లేదుకదా. మీరు నేఁడోరే పటో రాకయుండినఁ బ్రాణంబులఁ బాయుటకు సంసిద్ధనైయుంటిని.

తే. గీ. కాంచఁగల్గితి మీరూపు గఱవుదీర
జేయఁగానోఁచినాను మీ సేవ కాంత
లందున సుకీర్తి బొందంగ నలరినాను
కలరె ననుబోలు ధన్యలు క్ష్మాతలమున.

జయపా — రమణీ! ఎఱుఁగుదువుగదా మారాజకుమారుండగు జయంతుని ? అతనికి నాకును అతిమైత్రి.

తే. గీ. మఱవఁగాఁ జేయఁజాలను భాగ్యభోగ్య
ములను; కాంతపైనుండెడు భూరిప్రేమ
తల్లిదండ్రుల; దలఁపగా ధరణియందు
స్నేహమెంతకుఁ జాలను నీరజాక్షి.

శా. ఆమిత్రుండును నేనునుంఘనసుఖ వ్యాపార మేపారఁగా
భూమిన్ సంతతముం జరింపుచును మా పూబోండ్లపైనుండు న

త్వేప్రియా వీడితిమేమి చెప్పఁగలనో ? బింబోష్ఠిరో యిప్పుడా
హా! మిత్రుంను గతించె; సన్నిటుల చింతాంభోధిలోమును చెసూ

తన్వీమణీ! నాకును జయంతునకు నున్న మిత్రత్వమును వర్ణించుటకు శేషునకైనను దరంబుగాదు. పండిన నొక్క తయాత్రలంబు నందేపండవలెను. భుజించిన నొక్కకంచమునందే భుజింపవలెను. ఒక్క త్రుటికాలంబైనను మేమొండొరులను బాసియుండము. మా మిత్రత్వమునకు భంగముకలుగఁజేయవలెనని యెందఱోయెన్నియో ప్రయత్నములాచరించి తుదకు వ్యర్థప్రయత్నులైరి.

మ. ధరణీపాలుని పుత్త్రినింగలసి మోదంబార భూమిన్ నిరం
తరముల్ గాలముబుచ్చుచుంటి; నకటా ? తన్వంగిరో యిప్పుడా
వరమిత్రుంను గతింపుటన్ నినుగనన్ ? భావించి యేతెంచితిన్
సరసీజానన నాదునేరము కృపన్ ? సైరింపుమీ వేఁడెదన్.

చారు—నాథా! మీరంతమాట పలుకఁ జెల్లునా? మీపాద సేవకురాలను గదా.

జయపా— తే. గీ ఎన్నినాళ్లులాయెను కదా ? యింతినిన్ను
గాంచి; యాత్మ కానందంబు ? గలిగెనాకు
నిన్ను వీక్షించుటంజేసి ? నీరజాక్షి
తప్పుసైరింప వేఁడఁగాఁ ? దగదొనిన్ను

రమణీ! పుట్టినింటికడ నిన్నాళ్లు నిన్నుంచి దుఃఖములపాలుజేసిన పాపుండ. నాకై యెంత యారాటం బందితివోకదా

చారు—నేనందినయారాటం బంతయు మీముఖ సందర్శనంబున నడఁగంబె. మీపాదసేవసేయు భాగ్యంబు నేటికిలభించినది. అదియే నాకానందము. (ఇంచుక యూరకుండి) నాథా! ఉసికేమిగాని, మీకుఁ బరమమిత్రుండగు జయంతుని యకాలమరణంబునకుఁ గారణంబడుగవచ్చునా!

8

జయపా—ఆకారణము చెప్పఁదగను. ఈకలికాలంబున నావిధాత,

తే. గీ. మూల్గుచునుమూలఁగూర్చుండు ముసలివాండ్ర
పెక్కువస్త్రంబులిల జీవింపజేయు
సుందరాంగుల గూడి యానందమును
యౌవనాంగుల కిడుచుండు నకటచావు

మఱియు, తే. గీ. బిడ్డలను డబ్బుకాసించి విక్రయించు
వారు; జారునిపొందుకై పతులఁజంపు
వారు; జన్మంబునందియున్నారు జగతి
కట్ట! యేమిచెప్పుదు కలి కాలమహిమ.

చారు—(తనలో) నాథుండు చెప్పిన రెండువాక్యములందు విశేషార్థంబు స్ఫురించుచున్నది. ఈయన యిట్లు వచించుట కేమికారణమోకదా. (ప్రకాశముగా) మనోహరా! మీరుచెప్పిన రెండవవాక్యంబునఁగల యర్థంబు నాకుఁ దెలియుటలేదు.

జయపా—తరుణీ! అందు విశేషార్థమేమియును లేదు. ఇక్కలికాలంబున నట్టి కాంతలుండిరని చెప్పితిని.

చారు—ప్రపంచంబునంగలవారందఱునట్టివారనియే నామీ యభిప్రాయము లేక సద్గుణంబులుగల వధూటులుకూడ గలరనియా!

జయపా—సద్గుణంబులు గలవారరుదని నాయభిప్రాయము. (ఇంచుక యూరకుండి) సతీమణీ! ఆప్రసంగమంతయునిప్పుడేల? మార్గాయాసంబున డస్సియుంటిని. కావున నిప్పుడు శయనించి బడలిక వాపుకొందును. (శయ్యపైఁబరుండి) [illegible] ఈమంచము క్రిందనుంచి [illegible] (అని నిద్రపోవుచున్నాఁడు.)

చారు—(స్వగతము) మనోహరుఁడు వచ్చుటఁజేసి నామనంబెంత సంతోషమునొందెను. భర్తను సేవచేయు భాగ్యంబు నేటికి ల

భించినదికదా. (ఇంచుక యూరకుండి) నాథునికిదివరకిట్టిది ఈమంచ
ముక్రిందనున్న మూట నుట్టవలదని నానాథుడు వచించెను. ఇదేమి
యున్నదోకదా. మూటవిప్పిచూతునా. అట్లాచరించితినేని నాథునాజ్ఞ
నుల్లంఘించినదాననగుదు. అట్లుగాదు. నాథుండు నాకొరకేమైనా తె
చ్చియుండి పరిహాసంబున నట్లు పలికియుండును. కావున చూచెదను.
(అని మంచముక్రిందనున్న మూటను విప్పిచూచి) ఏమిది! ఆశ్చర్యము
గనున్నది. ఆస్తికలమూట యేటికిదెచ్చెనోకదా నాథుండు నాకొఱకేదై
నా తెచ్చెనని యిది పట్టితిని. తుదకివి యస్తికలయ్యెను. కానిమ్ము.
ఇదియెప్పటివలెనే మూటగట్టియుంచెదను. (అని యట్లు చేయుచున్నది)

(మంచముక్రిందనుండి జయంతుడు లేచి యివ్వలకు)

జయం—(కోపముతో)

పంచచామరము.

భయంబులేక మిత్రు నాదు భార్యగూడి యిట్టులన్
శయాతలంబునందు నిష్ఠ సంతసంబు జెందుచున్
నయంబునెల్ల నెంచి పాడి నావె దుర్మదాత్మ మా
రయంబునన్ శాసిచేతు ప్రాణమూడదీసెదన్.

ఓరీ! మిత్రద్రోహీ! ఎంతకార్యంబాచరించితివిరా! నాస్నేహ
మువలదని నిన్నెంతోచెప్పినను సిగ్గులేక నావెంటవచ్చి యిట్టిద్రో
హకార్యంబాచరించితివా. నిన్ను నమ్మినేనెంతమోసపోయితిని. బాల్యం
బాదిగ నావెంట జరించుచుండ గపటంబెఱుంగనివాడవనితలంచితిని
గాని యిట్లొనర్తువని దలంపనైతినిగదా! నీదుర్వర్తనంబంతయు మొన్న వే
శ్యతో సంభాషించినప్పుడే తెలిసినది. ఓరీ! దుష్కర్మా! నీకామము
దీర్చుకొనుటకు స్నేహితునిభార్యయే కావలసివచ్చెనా. ఔరా! ఎంత
పనిగావించితివి. ఓరీ! పాపాత్మా! పరాంగనలను రమించుటకేనా బ్ర
హ్మసృష్టించినది. ఇట్టికార్యంబాచరించుట పాపంబనియైనను నీమదికి

దోఁచలేదా. ఆవేశ్యను నేను గోరినప్పుడు పరాంగననుగూడుట పాపం బని నీవు నాకెన్నియో బుద్ధులుగఱపితివి. నీనీతులు కాలిపోయెనా. అవును మోహాంధకారంబున మునింగియున్న నీకు నీతులు దోచునా (ఆలోచించి) ఇట్టి దుష్కార్యంబాచరించిన యీపాపాత్ముని మదీయకర వాలంబున ఖండించి కృతార్థుండ నయ్యెద. (అని జయపాలుని ఖంఠంబు నఱికి చాయమతిం జూచి) హా! యెంత యకార్యంబాచరించితిని. (కలువ కుళ్ళులుచూచి) ఇది యంతయు మాయయగుచున్నది. ఈ కాంత నా భార్యకాదే. ఈమనుజుడను మా మిత్రుండగు వాడదికాదు. (చచ్చినజయపాలు నింజూచి) హా! జయపాలా! మిత్రశేఖరా!

(16) పాట — జంయాతు మల్హారు రాగము — రూపకము.

1 చంపితినామతి లేక । సఖా ॥ చంపితినా॥
మోచకసే మక । యుగ్రముదాలిచి ॥ చంపితినామతి॥

2 నాసతియనుకొని । మోసము జెందితి । వాసిగ గోపము గట్టిగ బాల
క ॥ చంపితినా॥

3 ప్రాణసఖుని నీదుప్రాణము దీసితి । దీనుడనై తిని తెలిసికొనదాక గతి॥
చంపితినా॥

తే. గీ. నాదుభార్యను సజ్జను జేరి నావటంచు
కలుకు నెత్తితి గంఠంబు నఱికినాడ
కట్టి! మితిలేని పాపంబు గట్టుకొంటి
నిందు కేమంచు జింతింతు నెందమందు.

అయ్యో! కోపంబుచే నొడలు తెలియకనిన్నీరీతిగానిజేసితికదా, ఎంతపాపంబు గట్టుకొంటి. సఖుండా నిన్ను జిన్నతనంబునుండియునాతో

తే. గీ. స్నేహమొనరించునట్టులు జేసినాడ
నెంచలేనిభాతిని సంచరించినాడ

నీవె నాప్రాణమంచును నే నెంచినాఁడ
పాపినైననీకు ప్రాణంబు నే బాపినాఁడ.

నీకు మిత్రుండనై [illegible] నీతోభుజించుచు సంతసంబున గాలంబుగడపుచు నీకు ప్రాణంబులు గూడ బాపితినిగదా. ఇవంటి మిత్రుండు నాకు వేయిజన్మంబులు తపంబాచరించిన దొరకునా. అక్కటా! చేతులారఁ జంపుకొంటిని. (ఇంచుక యాలోచించి) ఆహా! యీమందిరంబునకు నేనెట్లువచ్చితినోకదా. ఈమె [illegible] జయపాలుని భార్యవలెనే దోఁచుచున్నది. ఇప్పుడు నేనేమి చేయుదును? హా! భగవంతుఁడా! నాచేత నెట్టిదుష్కార్యం బాచరింపఁజేసితివి. (పరికించి) అదిగో! ఆమె నిద్రనుండి లేచుచున్నది. (భయము నభినయించుచున్నాఁడు.)

చారు—(నిద్రలేచి) మార్గాయాసంబున డస్సియుండుటచేనా థుండింకను నిద్రించుచునే యున్నవాఁడు. (అతనిపరికించి) ఆ! ఏమిది ఇరువురము గలసి శయనించియుండి, నేనుమాత్రము నిద్రలేచునప్పటి కీతనికంఠము నఱకఁబడియుండెను. అయ్యో! నాప్రాణనాథుని కేమిగతి పట్టెను. పెక్కువత్సరంబులనుండి నిజపాదదర్శనంబీయని మనోహరుండు నేఁడెంచె. ఇంక నాతని సేవచేసి కృతార్థురాలనగుదునని తలపోయుచు సంతసించుచుండగా నాకిట్టియవస్థ గాఁజెల్లునే మనోహరా! మీకోమలశరీరము నెట్టిగతిలోఁ జూడవలసివచ్చెను. నిర్భాగ్యురాలనగు నాతోఁగూడియుండుట కిచ్చలేక దివంబలకరించితిరా. నాకునిద్ర రాకున్నచో నింతముప్పు వాటిల్లకుండునేమోకదా. ఒకదినంబైనను మీపాదసేవ జేసి యెఱుంగనుగదా. పాపాత్మురాలనగు నాకాభాగ్యముగూడలభించునా. (ఇంచుక యూరకుండి) అక్కటా! కంఠమునఱకఁబడియుండుట కేమికారణమోకదా. ఏదుర్మార్గుండీసౌధంబు బ్రవేశించి యిట్టిఘోరకృత్యం బాచరించెనో యెఱుంగరాదు. (ప్రక్కకుదిరిగి జయంతునిజూచి) ఓరీ

ప్రాణేశ్వరుఁడు నగునితనిని దృటిలో జీవింపఁజేసెదను. (అని తన కుడి హస్తముచే జయపాలుని స్పృశించుచున్నది.)

[అంతటఁజయపాలుఁడు లేచుచున్నాఁడు]

జయపా—(కన్నులు నులిమికొనుచు) రమణీ! నిద్రనుండినన్ను మేల్కొలిపితివేల? (అని ప్రక్కనున్న జయంతుని విలోకించి) ఏమిదీ! ఆశ్చర్యముగనున్నదే! ఓయీ జయంతా! మరణించిన నీవు భూతంబవై వచ్చితివా!

జయం—నాచే వధింపఁబడిన నీవును నట్లేవచ్చితివా!

జయపా—(తనలో) ఇదివింతగానున్నది. మరణించిన యీతఁ డుమరల నెట్లు బ్రతికెనోకదా, నాకు భీతి కలుగుచున్నది.

జయం—మిత్రమా! ఏమి యాలోచించుచుంటివి? నేను నీ సఖుండనగు జయంతుడనే (అని సమీపించుచున్నాఁడు)

జయపా—నీవు భూతమువలెఁ దోచుచున్నావు. నన్ను సమీపింపకుము. చచ్చిపోయిన నీవుమరల నెట్లు వచ్చితివి?

జయం—నేను చావలేదు. నాచే నీవిప్పుడు చంపఁబడి మరల నీభార్యా ప్రభావంబునంజేసి బ్రతికితివి.

జయపా—(తనలో) ఈసంగతి నాభార్యనే కనుఁగొందు(చారుమతిని విలోకించి) రమణీ! ఏమిది? ఇదియంతయు నాకద్భుతంబుగఁ దోచుచున్నది.

చారు—మనోహరా! మీరు నిద్రజెందు సమయంబున మంచముక్రిందఁబెట్టిన మూటనంటవలదని వచించితిరి. కాని నేనూరకుండక నాకేమి తెచ్చితిరోయని నాసచే దానినివిప్పి యందస్థికలు జూచి, మరల నెప్పటివలెనుంచినిద్రబోతిని. పిదప నీజయంతుఁడెట్టులో వచ్చిమీ కంఠంబు నఱికి చింతించుచు నిలఁబడియుండ నేను మేల్కని యాతనిం

గాంచి మిమ్ములఁజంపుటకుఁ గారణంబడిగితిని, అందుల కాతఁడు తన భార్యపజ్జను మీరు పరుండిరను తలంపున నట్లు చేసితినని చెప్పెను. అంతట నేను నాకు గాళీమహాదేవి యిచ్చిన వరప్రభావంబున మిమ్ము బ్రతికించితిని. ఆతండును నట్లు లేచబ్రతికెనని నా నమ్మకము.

జయపా—(తనలో) ఏమి! నాతరుణీ ప్రభావము. (ప్రకాశముగా)

శా. నీపూాలంబునఁజూడఁగల్గితిని నా ♦ నెయ్యంపు మిత్రోత్తముఁ
భామా! చచ్చినయట్టి మమ్ముబ్రతికిం ♦ పంజేసి నాపివహో
నీమాహాత్మ్యము నెన్నగాను దరమా ♦ నే మాకు వీక్షింపఁగఁ
భూమిఁ, జూడఁగ లేదుసుమ్మొచట ని ♦ న్నుంబోలురామామణీ.

(17) సాంగు—జయంతుడు॥ వినుతసుగుణశీలా అనువరుస

1 బ్రతికించితివమ్మా నీపతినినన్ను సాధ్వీ ॥ బ్రతికించి ॥ ~~నతులపతివ్ర~~ తవునీవు సాధ్విపొగడదరమే ॥ బ్రతి ॥ గారీకృపచేసీదగు కాంతు బ్రోచినావు। భూరిమాహాత్మ్యముచేననుబ్రోచినావునీవు ।యీధారుణిలోనీకుసాటి తన్వులందుగలరే ॥ బ్రతికించితివమ్మా ॥

2 పుట్టినవంశంబునకునా । మెట్టినకులమునకు । నీయట్టికీర్తి దెచ్చినట్టి యంగనలిలగలరే । ఓపట్టినీకుజేయువాడ వందనములుగొనుమా । బ్రతికించితివమ్మా॥

జయం—కాంతాశిరోమణీ! ప్రాణంబులఁబాసిన మమ్ముసజీవులుగఁ జేసి, మామిత్రత్వమును మరల గలిపిన మహాపతివ్రతవగు నీకు నమస్కరింపుచున్నాను.

(నమస్కరించుచున్నాఁడు.)

(జయపాలునిజూచి) మిత్రమా! నేనేకారణంబున మాయత్త వారి గృహంబున నటింపఁబడితిని?

జయపా — అదియంతయు నీకుఁదరువాత రహస్యంబుగఁ దెలిపెద. ఇకమనము పూర్వపుభాతిని స్నేహితులమైతిమి. అదియేనాకుఁ బదివేలు. ఇంక మనకేమి కావలెను?

జయ — ఇంకఁ గావలసినదేమున్నది. అయిన నిట్లగుఁ గాక.

తే. గీ. తరుణులెల్ల సన్మార్గవర్తనము గలిగి
పుణ్యశీల యీమెవలె నొప్పుదురు గాక
న్యాయమన్యాయమెఱిఁగి భూనాథులెల్ల
ప్రజల నేలుచుండునుగాక భగవత్కృపను.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది పంచమాంకము.

సంపూర్ణము.






# బాలవితంతు విలాపము.

జాలిపుట్టించు పద్యములు. బాలవితంతువుల దురవస్థను కన్నులగట్టినట్లు వర్ణింపబడినవి. ఒక్క పద్యమువిన్నను వజ్రమువంటిహృదయమైనను వడగండ్లవలె కరిగిపోవును. ఇంత కరుణరసప్రధానమగు గ్రంథము ఆంధ్రభాషలో లేదు. శైలిమధురము. కరుణరసప్రధానము. కన్యాశుల్కము వరశుల్కము బాల్యవివాహము వృద్ధవివాహము. విషమవివాహాదులవల్ల మూడు కీడులను దేటతెల్లముగా దెలుపుచు నీతిబోధకమై విలసిల్లు హృద్యములగు పద్యములు.

వెల 0—5—0

వలయువారు:—

కర్రా అచ్చయ్య అండ్ సన్సు
బుక్‌సెల్లర్సు,
రాజమండ్రి.





| | | |
|---|---|---|
| శ్రీ[illegible]విలాసము | 0 | 10 |
| విచిత్రబిల్హణీయం వృ॥ అ॥ | 0 | 8 |
| [illegible]నాట | 0 | 12 |
| [illegible]జయం ఇ॥ యొ॥ | 1 | 0 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 2 |
| పద్మవ్యూహము | 1 | 0 |
| శ్రీరామవిజయం కో॥ వ | 0 | 10 |
| సంగీత స్త్రైంధవార్జనీయం గా॥ శీ॥ | 0 | 8 |
| సంగీత పాశుపతార్జునీయం ,, | 0 | 8 |
| సీతాకళ్యాణం ,, | 0 | 8 |
| గాంధీవిజయధ్వజం శ్రీ॥ కృ॥ | 1 | 0 |
| తిలకుమహారాజు నాటకం ,, | 1 | 0 |
| ఆంధ్రనాటకకృతులు | | |
| మొదటిభాగం | 0 | 10 |
| డిటో రెండవభాగం | 0 | 10 |

## నవలలు.

| | | |
|---|---|---|
| సౌందర్యతిలక చి॥ ల॥ | 1 | 0 |
| కర్పూరమంజరి | 1 | 0 |
| సుధాశరచ్చంద్ర | 1 | 0 |
| గణపతి 1 & 2భా | 1 | 8 |
| అహల్యాబాయి | 0 | 12 |
| హేమలత | 0 | 12 |
| రాజరత్నము | 0 | 12 |
| సిద్ధార్థచరిత్ర | 0 | 10 |
| రామచంద్రవిజయం | 0 | 10 |
| రఘుకుల చరిత్ర | 0 | 10 |
| భారతకథామంజరి | 0 | 8 |
| వినోదములు 1 & 2భా | 0 | 8 |
| డిటో 3భా | 0 | 8 |
| కృష్ణవేణి | 0 | 6 |
| మణిమంజరి | 0 | 6 |
| నందచరిత్ర | 0 | 4 |
| సువర్ణగుప్తుడు | 0 | 4 |
| సాక్షి పా॥ ల॥ క్యాలికో | 2 | 0 |
| పద్మావతి వృ॥ అ॥ | 1 | 8 |
| ప్రసన్నముఖి చ॥ మూ॥ | 1 | 0 |
| ఇందుమణి | 1 | 0 |
| ఆనందమఠ | 1 | 0 |
| కపాలకుండలి | 1 | 0 |
| యశస్తిలక | 0 | 10 |
| చిత్రలేఖ | 0 | 10 |
| శ్రీదేవి | 0 | 10 |
| లలితకుమారి | 0 | 10 |
| పెద్దాపురం సంస్థానచరిత్రం | 0 | 10 |
| పురంజయ | 0 | 14 |
| హమీర్‌సింగు | 0 | 12 |
| ఆళహరసింగు | 0 | 8 |
| దాదాబాయినౌరోజి | 0 | 3 |
| శివాజీచరిత్ర | 0 | 3 |
| బేతాళునియద్భుతకథలు వే॥ వెం॥ ... | 0 | 12 |

## స్త్రీలకు ఉపయోగించు పుస్తకములు.

| | | |
|---|---|---|
| పాటరామాయణము | 1 | 0 |

# ఆంధ్రనాటకములు.

| | రు | అ |
|---|---|---|
| చిత్రనళీయము ధ. కృ. | 1 | 6 |
| విషాదసారంగధర | 1 | 6 |
| పాంచాలీస్వయంవరము | 1 | 2 |
| మోహినీరుక్మాంగద | 1 | 2 |
| ప్రమీలార్జునీయము | 1 | 2 |
| చంద్రహాస | 1 | 2 |
| బృహన్నల | 1 | 2 |
| ముక్తావళి | 1 | 2 |
| వరూధిని | 1 | 2 |
| చిరకారి | 1 | 2 |
| గయోపాఖ్యానము॥చి॥ ల | 0 | 8 |
| ప్రసన్నయాదవము | 0 | 8 |
| పారిజాతాపహరణము | 0 | 8 |
| చతురచంద్రహాస | 0 | 8 |
| స్వప్నవాసవదత్త | 0 | 6 |
| పార్వతీపరిణయం | 0 | 6 |
| సంగీత సత్యావిజయమను హరిశ్చంద్ర చ॥ మా॥ | 1 | 0 |
| సంగీతసావిత్రి చ॥ మా॥ | 1 | 0 |
| సంగీతప్రహ్లాద | 0 | 12 |
| మహారాష్ట్రవిజయం | 0 | 12 |
| చంద్రకాంత పాటలు | 0 | 10 |
| సంగీత స్త్రీసాహసము | 0 | 12 |
| సంగీత శశిరేఖ | 0 | 8 |
| రంగారాయ కదనసమ వాకారము. బొబ్బిలియుద్ధము కా॥ సా॥ | 1 | 0 |
| కన్యకాపరమేశ్వరి | 1 | 0 |
| సుగుణమణి వ॥ బా॥ | 0 | 10 |
| శ్రీ రామజననము దో॥ సీ॥ | 0 | 8 |
| శ్రీరామప్రవాసము | 0 | 8 |
| శ్రీరామవుద్యోగము | 0 | 8 |
| శ్రీరామవిజయము | 0 | 8 |
| శ్రీరామఅశ్వమేధము | 0 | 8 |
| పాండవఅజ్ఞాతవాసం | 0 | 8 |
| సారంగధర | 0 | 8 |
| సంగీతజయంతజయపాలం | 0 | 8 |
| ఉషాపరిణయము | 0 | 8 |
| హస్తినాపురము | 0 | 8 |
| ద్రౌపదీ పరిణయము | 0 | 12 |
| విజయబొబ్బిలి | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారము | 0 | 12 |
| వైదర్భీవిలాసము | 0 | 10 |
| సామ్రాజ్యోదయం | 0 | 10 |
| ఆంధ్రపతాకము | 0 | 12 |
| పాదుకాపట్టాభిషేకం పాటలు | 0 | 12 |
| లంకాదహనము పాటలు | 0 | 10 |
| గులేబకావళి అ॥ సు॥ | 1 | 0 |
| ఊర్వశీశాపవిమోచనము | 1 | 0 |
| జయచంద్రచంద్రరేఖావిజయమను లాల్ గోహరు | 0 | 10 |
| ప్రతిజ్ఞా పాండవము | 0 | 10 |

వలయువారు

కర్రా అచ్చయ్య అండ్ సన్సు,

బుక్కుసెల్లర్స్, రాజమండ్రి.